

# వైదిక అగ్నిహోత్రవిధి
# విశేష పర్వ హోమాలు

వివరణ :

**సుమ్నార్థి**

**(డా॥ కోడూరి సుబ్బారావు)**

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**

**12-10-586/6,** ఆర్య సమాజము - మేడిబావి,

వారాసిగూడ, సికింద్రాబాదు - **500 061**

**Cell : 98480 11073, 99089 94084**

గాయత్రీ గ్రంథమాల : 61

# వైదిక పండుగలు - విశేష పర్వ హోమాలు

| | | |
|---|---|---|
| ప్రతులు | : | 1000 |




| | | |
|---|---|---|
| దయానందాబ్దము | : | 201 |
| సృష్టి సంవత్సరం | : | 196,08,53,125 |
| విక్రమాబ్దము | : | 2081 |
| కలియుగ సంవత్సరం | : | 5125 |
| సంవత్సరము | : | శ్రీక్రోధి నామ సంవత్సరము |
| ఆంగ్ల సంవత్సరము | : | 2024 |

**మూల్యము : 60/-** (తపాలా ఖర్చులు అదనము)

**ప్రతులకు :**

1. **డా॥ కోదూరి సుబ్బారావు**
   **గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,** ఆర్య సమాజము, 12-10-586/6,
   మేడిబావి, సీతాఫలమండి, సికింద్రాబాద్-500 061.
   సెల్: 99089 94084, 98480 11073.

2. **ఆర్య సమాజము**
   సీతాఫలమండి, మెయిన్‌రోడ్,
   రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
   సికింద్రాబాద్ - 500 061.
   సెల్: 99893 36766, 9000621950

3. **డా॥ మట్టి కృష్ణారెడ్డి,** వేదధర్మ ప్రచార ట్రస్టు(రి.).,
   2-27, ఆర్య సమాజ మందిరం,
   బాదం కాంప్లెక్సు, చైత్యనపురి క్రాస్ రోడ్, దిల్‌సుఖ్‌నగర్.
   హైదరాబాద్-60. సెల్: 94412 00322.

# ఈ పుస్తకంలో...

1. ప్రార్థన, దాతల పరిచయం, పండుగలే పర్వాలు – ముందు పుటలలో
2. దైనిక అగ్నిహోత్ర విధి
3. బృహద్ యజ్ఞ విశేష ఆహుతులు
4. పుత్రుల సంక్షేమం కొరకు పౌర్ణమాస్యేష్టి
5. పితరుల సంక్షేమం కొరకు అమావాస్యేష్టి
6. విశేష పర్వ హోమాలు
7. హారతి
8. ఓం ధ్వజ గీతము (హిందీ)
9. వైదిక ధ్వజ గీతము
10. యజ్ఞాంత ప్రార్థన – పూజనీయ ప్రభో
11. స్వస్తివాచనం
12. శాంతి ప్రకరణము

## చదవండి – ఆలోచించండి

## సత్యాన్ని గ్రహించి ఆచరించండి

# ప్రార్థన

## యజ్ఞీయ నౌక నధిరోహించు

**ఓం పృథక్ ప్రాయన్ ప్రథమా దేవహూతయో౾**
**కృణ్వత శ్రవస్యాని దుష్టరా ।**
**న యే శే కుర్యజ్ఞియాం నావమారు**
**హమీర్మైవ తే న్యవిశన్త కేపయః ॥**

– ఋ. 10. 44. 6 / అథర్వ 20. 94. 6

**భావము:** దివ్య గుణాల నాహ్వానించు ఉత్తమ మానవులు ప్రకృష్ట మార్గమైన యాజ్ఞిక మార్గముననుసరిస్తారు. ఉత్తమ లోకాలను – జన్మలను పొందుతారు. మిక్కిలి దుస్తరమై జ్ఞానైశ్వర్యాలను అభ్యుదయ నిశ్శ్రేయసాలను సాధిస్తారు. పరమానందాన్ని పొందుతారు. దానికి భిన్నమైన సోమరులు, ఇంద్రియలోలురు, సంకుచితులు, దుష్టులు ఈ యజ్ఞీయ నావను అధిరోహించలేక సంసార సముద్రంలో మునిగిపోయి పెక్కు కష్టాలను అనుభవిస్తారు.

# ముద్రణ వ్యయదాతల పరిచయము

## మాతృశ్రీ పెద్ది వీరలక్ష్మి, శ్రీ సదానందరావు గార్లతో నా పరిచయము

సుమారు 20 సంవత్సరాల పూర్వం భువనగిరిలోని వైదిక వానప్రస్థాశ్రమం నిర్మించినారు. అప్పటినుండి నేను కూడా అక్కడికి చేరుకున్నాను. అక్కడ వచ్చి ఉండవచ్చునని కార్యకర్తలు, అధ్యక్షులు తెలిపారు. అట్టి సమయంలో నాకు పెద్ది వీరలక్ష్మి, సదానందరావు దంపతులతో పరిచయం అయ్యింది. సంపూర్ణ యజుర్వేద పారాయణం యజ్ఞము చేయాలని వారికి సంకల్పం కలిగింది. అందుకు కార్యకర్తలంతా ఏర్పాట్లు చేశారు. వీరు శ్రీమతి సంధ్యావందనం లక్ష్మీదేవి, శ్రీనివాసరావుగార్లు నిర్వహించే సత్సంగాలకు వెడుతూ ఉండటంవల్ల వైదిక సిద్ధాంతాలతోను, యజ్ఞ యాగాదులతోను పరిచయం వుంది. నాకును ఆనందమయ్యింది. ఈ రూపంలోనైనా సంపూర్ణ యజుర్వేదం వినగలుగుతున్నానని సంతసించి సహకరించాను. సంధ్యావందనం దంపతులు పౌరోహిత్యం వహించారు.

ఈ కార్యక్రమంతో శ్రీమతి వీరలక్ష్మి గారికి తానూ మంత్రాలు చదవాలనే కోరిక కలిగింది. అభ్యాసం చేస్తూ చేస్తూ వేద పండితులను తన ఇంటికి ఆహ్వానించి వారివద్ద వేదం చదవటం అభ్యసించారు. క్రమంగా స్వయంగా వేదమంత్రాలు చదవగలిగేస్థాయికి వచ్చారు. **"సాధనమున పనులు సమకూరు ధరలోన"** అనే సూక్తి శ్రీమతి వీరలక్ష్మి గారిలో సార్థకమయ్యింది. ఆ ప్రవృత్తి ఆమె దివంగత అయ్యేవరకు కొనసాగింది.

## చతుర్వేద పారాయణ యజ్ఞం

యజుర్వేద పారాయణ యజ్ఞానంతరం ఆమె మనస్సు చతుర్వేద పారాయణ యజ్ఞం కూడా చేయ సంకల్పించారు. ఇది సాహసమే. సుమారు 4, 5 నెలలు ఇంట్లోనే ఉంటూ నియమంగా రెండుపూటలా యజ్ఞం చేస్తూ దానిని పూర్తిచేశారు. శ్రీ సదానందరావు గారు చాలా మితభాషి. చాలా అవసరమైతేనే మాట్లాడే ప్రవృత్తి. ఆయన రాష్ట్రంలో సివిల్ ఇంజనీయరుగా పనిచేసి ఆఫీసర్‌గా రిటైరైన వ్యక్తి. వారు భార్య వ్రతాలకు, దీక్షలకు ఎట్టి అభ్యంతరం చెప్పక సహకరించేవారు. పురోహితులు

రోజూ ఎవరు వస్తారు? విశేష దినాలలో వచ్చి దక్షిణలు తీసుకు వెడతారు కదా! వారు భువనగిరి ఆశ్రమంలో వుంటే నేను కొంత సహకరించేవాడిని. వారు సికింద్రాబాద్ లాల్‌బజార్‌లోని స్వంత ఇంట్లో చేశారు. నేను సికింద్రాబాద్ వెళ్ళినప్పుడు ఒకసారి ఉదయపు యజ్ఞానికి వెళ్ళి చూశాను. క్రొత్త మంత్రాలు నేను కూడా బాగా చదువలేను. చదివితే ఆయాసం వస్తుంది. కనుక మౌనంగా ఉంటూ పరిశీలించాను. ఫరవాలేదు ఆమె బాగానే చదువగలిగారు. ఆ పూట అక్కడనే అల్పాహారం తీసుకొని తిరిగి వచ్చాను. ఆ దీక్ష పూర్తియైన తదుపరి ఆశ్రమానికి వచ్చారు. దురదృష్టవశాత్తు ఆమెకు పతి వియోగం జరిగింది. శ్రీ సదానందరావు గారు దివంగతులయ్యారు. వారిది చాలా అనాయాస మరణం. ఒకరోజు విదేశాలలో నున్న తన కుమారునితో చక్కగా మాట్లాడారు. అనంతరం కొన్ని నిముషాలకే గుండె ఆగిపోయి మృతి చెందారు. ఎంతో పుణ్యం చేసివుంటే కాని అటువంటి అనాయాస మరణం రాదని పెద్దలంటారు. అంతా ఈశ్వరేచ్ఛ.

శ్రీమతి వీరలక్ష్మి గారు మంచి దానశీలి. పండితులకు, ఆచార్యులకు, పురోహితులకు, పనివారలకు డబ్బు రూపంలో, వస్తు రూపంలో విరివిగా దానాలు చేస్తూ ఉండేవారు. నాకును వారు చాలాసార్లు ధనం, బట్టల, వస్తువులు యిచ్చారు. కనుక ఆమె ఒక పుణ్యజీవి. భువనగిరి వానప్రస్థాశ్రమానికి గోవులకు గడ్డి, పిండి మొదలగువాటికి చాలా పర్యాయాలు దానం చేశారు.

శ్రీమతి వీరలక్ష్మి గారి మృత్యువు కూడా అనాయాసంగానే జరిగింది. ఆమె పుణ్యజీవి.

సర్వవ్యాపక సర్వేశ్వరునిచే నిర్మింపబడిన ఈ సృష్టిలో పుట్టిన ప్రతి ప్రాణిని మృత్యువు శాసిస్తుంది. చంపుతుంది. వేదం ఏమంటుందంటే –

**మం॥ మృత్యురీశే ద్విపదాం మృత్యురీశే చతుష్పదామ్ ।**
**తస్మాత్ త్వాం మృత్యోర్గోపతేరుద్భరామి సమాబిభేః ॥** – అథర్వ. 8-9-23

మృత్యుదేవత ద్విపాదులైన మనుష్యులను, పక్షి జాతులను శాసిస్తుంది. అట్లే అది చతుష్పాద జంతువులను కూడా శాసిస్తుంది. మీరు శరీరాన్ని గోవు అనుకుంటే మృత్యువు గోపతి. కనుక మృత్యువును ఎవరూ తప్పించుకోలేరు. కనుక భయపడకండి అంటున్నది పై వేదమంత్రం.

ఈ విషయాన్నే భగవద్గీతలో శ్రీకృష్ణుడు సాంఖ్యయోగాధ్యాయంలో చెప్పాడు. అందులోని ఒక శ్లోకం ఏమంటున్నదంటే –

**శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్య చ ।**
**తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి ॥** – భ.గీ. 2–27

"సృష్టిలో పుట్టిన ప్రతీ ప్రాణి మరణించక తప్పదు. దీనిని ఎవరూ నిరోధించలేరు. ఇది సృష్టి నియమం కనుక ఇట్టి అపరిహార్య విషయాన్ని గురించి నీవు బాధపడవద్దు. నీ కర్తవ్యాన్ని చేసుకుంటూ పోవటమే ఉత్తమం" అంటున్నది.

ఇంతటి ఆదర్శ జీవితం గడిపిన శ్రీమతి వీరలక్ష్మి గారి స్మృతిలో ఒక గ్రంథాన్ని ముద్రించి వితరణ చేస్తే బాగుంటుందని వారి కుమార్తెలను, కుమారుని ప్రోత్సహించాను. దానికి వారు వెంటనే అంగీకరించినారు. అట్టి ఈ కుటుంబాలను సర్వవ్యాపక సర్వేశ్వరుడు దీర్ఘ ఆయురారోగ్యాలతో అనుగ్రహించును గాక. అందరికి ధన్యవాదాలు.

మీ శ్రేయోభిలాషి

**సుమ్నార్థి**

**(డా॥ కోడూరి సుబ్బారావు)**

# మా తల్లిదండ్రులు



**కీ.శే. పెద్ది సదానందరావు** జ: 5 డిసెంబర్ 1936 – మ: 29 జనవరి 2013

**కీ.శే. పెద్ది వీరలక్ష్మి** జ: 3 అక్టోబర్ 1942 – మ: జనవరి 2024

సంతానము: 4గురు. ఒక కుమారుడు, ముగ్గురు కుమార్తెలు

కుమారుడు : పెద్ది రాజేందర్, కోడలు : పెద్ది శ్రీదేవి

మొదటి కుమార్తె : పరిశ ఉమారాణి, భర్త : రామకృష్ణరావు

రెండవ కుమార్తె : గౌరిశెట్టి గీతారాణి, భర్త – రవి

మూడవ కుమార్తె : రేణుకుంట శ్రీలత, భర్త – రవీందర్

వీరికి మనవళ్ళు, మనవరాళ్ళు, మునిమనుమడు,ముని మనుమరాళ్ళు కూడా కలిగారు.

శ్రీమతి వీరలక్ష్మిగారు ప్రతిరోజు తప్పకుండా వైదిక పద్ధతిలో యజ్ఞము చేసేవారు. వారికి వేదములంటె చాలా ఇష్టము. వార తన పరివార సభ్యులందు మరియు స్నేహితులందు వేదముల గురించి చాలా ప్రచారము చేశారు. వారు తన 60వ సంవత్సరములో ఒక పద్ధతిలో, తెలిసిన పండితులతో అక్షరాలతో సహా, సరి అయిన ధ్వనితో వేద మంత్రములను చదవడము నేర్చుకున్నారు. ఇది ఒకరకముగా తన 60వ సంవత్సరములో పలక బలపము పట్టి అక్షరాలు

రాయడము లాంటిదే. ఎన్నోసార్లు పండితులతో తను సరిగా చదువుతున్నానో లేదా అని తెలుసుకునేవారు. వారికి గురువుల సేవా భావన బాగా ఉండేది. వారు మరియు భర్త శ్రీసదానంద రావుగారితో కలిసి చతుర్వేద యజ్ఞము మరియు వివిధ ప్రత్యేక యజ్ఞములు చేశారు. ఈ పుణ్య దంపతులు వేదములకు సంబంధించిన కార్యములకు మరియు పుస్తకముల ప్రచురణకు ధన సహకారము చేసేవారు. శ్రీమతి వీరలక్ష్మి గారికి నిత్యము యజ్ఞము చేయడము ఎంతో ఇష్టము. వారు విదేశము (కెనడా)లో కూడా తన కుమారుని వద్ద ఉన్నప్పుడు, నిత్యము శ్రద్ధగా, పద్ధతిగా యజ్ఞము చేసేవారు. తను వైదిక ఆశ్రమము నందు ఉన్నప్పుడు కూడా రోజు ప్రొద్దున ఆశ్రమ సభ్యులతో కలిసి వైదిక యజ్ఞము చేసేవారు. ప్రతిరోజు వేదపఠనము దినచర్యలో ఒక భాగము. చతుర్వేద పారాయణము చాలాసార్లు చేశారు. వారంటే వారి కుటుంబములోని వారందరికి చాలా ఇష్టము. ప్రత్యేకంగా వారి ఆశీర్వాద మంత్రములు ప్రత్యేక దినములలో (జన్మదినము, పండగలు, వివాహ దినములు) ప్రతిఒక్కరు చాలా బాగా ఇష్టపడేవారు. వారు అనుకున్నట్లు వారి తుదిశ్వాస కూడా తనకు ఇష్టమైన వైదిక ఆశ్రమములోనే విడిచారు. వైదిక పద్ధతిని వారి అంత్యేష్టి సంస్కారం నేతితో సుగంధ ద్రవ్యాలతో జరిగినది.

ఈ పుస్తక ప్రచురణ బాగా జరగాలని, అందరూ చదవాలని ఇందులోని విషయాన్ని గ్రహించాలని కోరుతూ పుస్తక రచయిత డా।। కోడూరి సుబ్బారావు గారికి శుభాకాంక్షలు తెలుపుతున్నాయి.

**ధన్యవాదములతో**

కీ.శే. పెద్ది సదానందరావు మరియు కీ.శే వీరలక్ష్మి గారి కుమారుడు

మరియు కుమార్తెలు

# శ్రీమతి పెద్ది వీరలక్ష్మి గారికి

# మా హార్దిక శ్రద్ధాంజలి

శ్రీమతి పెద్ది వీరలక్ష్మి, శ్రీ సదానందము దంపతులు ఆశ్రమములో వానప్రస్థులుగ జీవనము గడుపుట కొరకు మా ఆశ్రమ సభ్యత్వము తీసుకున్నారు. వారి కుటుంబమంతా ఉన్నత విద్యావంతులు. వీరలక్ష్మి అమ్మగారు నిత్యాగ్నిహోత్రులు. సదా వేదాధ్యయనము చేయుచుండేవారు. యజ్ఞంపై వారికి అమితమైన ప్రేమ. ప్రతిరోజూ విశేష వేదమంత్రాలతో ఆహుతులు యిప్పించేవారు. మరియు ఆశ్రమములో ఒక గురుకులము ఏర్పాటు చేయవలయునని చాలా తపన పడేవారు. గురుకులం ఏర్పాటు చేస్తే నిత్యము యజ్ఞం నిరాటంకముగా జరుగునని విశేష యజ్ఞాలు కూడా చేయవచ్చునని కోరుచుండేవారు. ఆశ్రమములో ఆవులకు గ్రాసము కొరకు ఇబ్బంది కలుగుచున్నదని నాతో తెలుసుకుని వారు మరియు వారి బంధువుల నుండి పెద్దఎత్తున ఆర్థిక సహాయము చేసినారు. పుణ్యాత్ములు, ధర్మాత్ములు యజ్ఞం కొరకు కూడా ఆర్థిక సహాయము చేసేవారు. ఆమె శరీరము సహకరించకున్నా వీలుఛైర్‌లో వచ్చి యజ్ఞం చేసేవారు. మరియు శ్రీమతి వర్దా రుక్మిణి గారిని ప్రోత్సహించి విశేష మంత్రాలు చదివించేవారు. ఆమెతో మా దంపతులకు ఉన్న అనుబంధము మరువలేనిది. ఆమె లేకపోవడం ఆశ్రమమునకు తీరనిలోటు. భగవంతుడు ఆమెకు సద్గతి నివ్వాలని ప్రార్థన.

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రద్ధాంజలులతో...

వైదిక వానప్రస్థ ఆశ్రమ (సభ్యులు) అధ్యక్షులు

**వరదా రాములు**

మరియు ఆశ్రమ సభ్యులు

**వై. వీరేశము**



# పండుగలే పర్వాలు :

పండుగలను సంస్కృతంలో పర్వము లంటారు. పర్వ పదము తెలుగులోనూ వాడుకలో ఉంది. వ్యాసమహర్షి తాను వ్రాసిన వాస్తవిక చరిత్ర గ్రంథమైన మహాభారతంలోని అధ్యాయాలకు పర్వములని పేరు పెట్టారు. ఆదిపర్వము, సభాపర్వము, అరణ్యపర్వము..... ఈ విధంగా 18 అధ్యాయాలకు 18 పేర్లు పెట్టారు. తెలుగు నిఘంటువులో పర్వ పదమునకు చెఱుకుగడ కనుపులు, శుక్ల కృష్ణ పక్షాల సంధులు (అమావాస్యా పౌర్ణమిలు), జడముడులు, పండుగలు మొదలైన మరికొన్ని అర్థాలున్నాయి. వాటిలో వ్యాసమహర్షి 'చెఱకుగడ కనుపులు' అనే అర్థాన్ని తీసుకొని అధ్యాయాలకు పేర్లు పెట్టారు. చెఱకుగడ కనుపు కనుపుకు రుచిలో స్వల్పభేదం ఉంటుందట. అట్లే భారతాధ్యాయాలలో కూడా రుచులుంటాయని వ్యాసమహర్షి అభిప్రాయమని పెద్దలంటారు. చాంద్రమాన శుక్ల కృష్ణ పక్షాల సంధులైన పౌర్ణమి అమావాస్యలను పూర్వం పండుగలుగా సెలవు దినాలుగా (Holidays గా) జరుపుకునేవారు. ఆంగ్లేయ పాలనలోనే ఆదివారాలను సెలవుదినాలుగా బలవంతంగా మనపై రుద్దారు. కనుక మన సంప్రదాయాన్ని అనుసరిస్తూ ఈ పుస్తకంలో పౌర్ణమి, అమావాస్యల పరమార్థాన్ని ముందుగా చేర్చాము.

ఇక సంస్కృతంలోనూ పర్వ పదమునకు చాలా అర్థాలున్నాయి. ఇది "పౄ-పాలన పూరణయోః" అనే మూల సంస్కృత ధాతువుతో నిర్మింపబడుతుంది. కనుక "పాలించేది, పూరించేది" అని మూలార్థం (Root Meaning). పండుగ వస్తున్నదంటే ముందుగానే ఇంట్లో ఉండే చెత్తా చెదారం బయటపడేసి ఇల్లు శుభ్రం చేసుకుంటాము. పండుగ రోజున పెందలకడనే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకొని అభ్యంగన స్నానం చేస్తాము. క్రొత్త బట్టలు లేదా మంచి బట్టలు కట్టుకుని ముందుగా సృష్టికర్తను స్మరించుకొని పూజలు, యజ్ఞాలు చేస్తాము. పెద్దలకు పాదాభివందనం లేదా వినయంగా నమస్కరించి వారి ఆశీస్సులందుకుంటాము. దానివల్ల మనకెంతో

తృప్తి, ఆనందం కలుగుతాయి. ఇవన్నీ పరోక్షంగా మనలను పాలిస్తాయి. కాపాడతాయి. మనకు సద్భావనలు, సత్సంకల్పాలు కలుగుతాయి. అవి మనకు ఉన్నతిని కలిగిస్తాయి. పర్వ పదమునకు రెండవ అర్థం – పూరించటం. నింపటం. శరీరంలోని, మనస్సులోని లోటుపాట్లను పర్వాలు (పండుగలు) పూరిస్తాయి. సామాన్యంగా మనం సామాన్య దినాలలో సామాన్య భోజనం చేస్తూంటాము. అది అన్నం, రొట్టెలు, కూరలు, పచ్చళ్ళతో సామాన్యంగా ఉంటుంది. ఇవన్నీ పిండి పదార్థాలు. ఇవి కేలరీలను – శక్తిని మాత్రమే ఇస్తాయి. పండుగనాడు విశేషంగా పిండివంటలతో భోంచేస్తాము. పప్పులు, నెయ్యి నూనెలతో చేసినవి, పాలతో వండినవి తింటాము. దానితో మన శరీర నిర్మాణానికి కావలసిన ప్రొటీన్లు, క్రొవ్వులు, కాల్షియం, పొటాషియం, మెగ్నీషియం మొదలైనవి అందుతాయి. వాటితో శారీరక ఎదుగుదలలు, అరుగుదలలు పూరింపబడతాయి. కనుకనే మన ఋషులు పర్వాలను, వాటి విధివిధానాలను రూపకల్పన చేశారు.

యాస్కమహర్షి కృత నిరుక్త శాస్త్రం (1-20) పర్వ పదమునకు మరికొన్ని విశాలమైన అర్థాలు చెబుతుంది. “దేనిద్వారా బంధుమిత్రులు పరస్పరం ప్రీతితో కలుసుకొని శుభాకాంక్షలు చెప్పుకుంటారో” అదియును పర్వమే నంటుంది. ఋగ్వేదం (4-22-2)లో **“పర్వాణి సఖ్యాయ వివ్యే”** అనే వాక్యం వస్తుంది. అంటే – పర్వాలు (పండుగలు) ప్రజలలో పరస్పరం సఖ్యతను (మైత్రీభావాన్ని) పెంచేవిగాను, పరమమిత్రుడైన పరమేశ్వరునితో సఖ్యతను పెంచేవిగాను జరుపుకోవాలని అర్థం. యాస్క మహర్షి రెండవ అర్థంగా – “అర్ధమాస – పర్వ దేవానస్మిన్ ప్రేణన్తీతి” – అర్ధమాసానికి వచ్చే పౌర్ణమీ అమావాస్యలను పర్వములంటారు. ఆ దినములలో విశేష హోమాలను చేసి దేవతలను (పంచభూతాలను, ప్రాకృతిక శక్తులను) తృప్తిపరచాలంటారు. తైత్తరీయ సంహిత (2.56.6) లో “అర్ధమాసే దేవా ఇజ్యన్తే” అంటుంది. ప్రాకృతిక దేవతలను తృప్తి పరచటానికి అగ్నిహోత్రమే ముఖ్యమంటుంది. అదే సరైన దేవపూజ అంటుంది. కనుకనే మేము ఈ **“వైదిక అగ్నిహోత్ర విధి – విశేష పర్వ హోమాలు”** పుస్తకంలో పౌర్ణమి అమావాస్యలను మొదటి పర్వాలుగా చేర్చాము. అగ్నిహోత్రం ద్వారా దేవపూజ అన్ని పర్వాలలోను జరుపుకోవలసిందేననీ, ఆయా పర్వాలకు చెందిన మంత్రాలతో ఆహుతులివ్వవలసిందేననీ మహర్షులన్నారు. ఆ వివరాలు ఆర్య విద్వాంసులు సంకలనం చేసిన **“ఆర్య పర్వ పద్ధతి”**లో చూడగోరుచున్నాము.



# దైనిక అగ్నిహోత్ర విధి

**1. హవనకుండము :** రాగి, ఇత్తడి, ఇనుము మున్నగు ఏదేని లోహంతో గాని, లేదా మట్టితోగాని చేసినదై ఉండవచ్చును. అది పై వెడల్పు 12 అం. చతురస్రము, క్రింద వెడల్పు 3 అం. చతురస్రము వచ్చునట్లు ఏటవాలు గోడలు కలిగి 12 అం. లోతు కలిగినదిగా నుండవలెను. కుండము బోర్లించిన పిరమిడ్ ఆకారం బోలియుండును. ఇటువంటి ఆకారంలో వివిధ పరిమాణములలో చిన్నగ పెద్దగ కుండములు నిర్మించుకొనవచ్చును. కుండము చక్కగా నిలబడునట్లు క్రింద ఆధారములు (చిన్న కాళ్ళు) ఏర్పాటు చేసికొనవచ్చును. లేదా భూమిపై స్థాపితం చేసుకొనవచ్చును. గ్రామాంతరం వెళ్ళినపుడు కుండము లేని పరిస్థితుల్లో నేలపైన కొంత ఇసుక పోసి, దానిపై సమిధలను పేర్చి అగ్నిహోత్రం చేసుకొనవచ్చును.

**2. సమిధలు :** మండునపుడు పొగ, దుర్గంధం రానివిగాను, బొగ్గుగా మిగులక భస్మమగునవిగాను ఉండు సమిధలను (కట్టెలను, పుల్లలను) ఉపయోగించవలెను. అందుకు మామిడి, మోదుగ, మర్రి, రావి, జువ్వి, మేడి, మారేడు మున్నగునవి అనుకూలంగా ఉంటాయి. అవి పైపట్టతో కలిసి ఎండినవిగా ఉండుట మంచిది. తులసి, అగరు, తగరు, రుద్రజడ, వట్టివేళ్ళు మొదలగు పుల్లలు కూడా ఉపయోగించవచ్చును. ఇవి ఏవియు లభింపకున్న అగ్నిహోత్రం చేయుట మానుకోవలదు. దొరికిన వాటితోనే చేయుట మంచిది. కాని, అవి పుచ్చినవి, మలినమైనవి, చాలా పాతవికానివై ఉండాలి.

**3. హోమ ద్రవ్యాలు :** వీటిలో శుద్ధమైన ఆవునెయ్యి ప్రధానమైనది. ప్రతి మంత్రం చివర స్వాహా కారంతో ఒక నేతి ఆహుతి ఇవ్వవలసి ఉంటుంది. ఆవునేయి లభింపకున్న శుద్ధమైన గేదెనెయ్యితో హోమం చెయ్యవచ్చున. కాని, డాల్డాతో చేయరాదు. దైనిక అగ్నిహోత్రానికి ఒక సమయమునకు సుమారు 5 తు. లేదా 50 గ్రా. నెయ్యి అవసరమౌతుంది.

ప్రాతః సాయం హవన మంత్రాల చివర నేతితోబాటు మరొకరు

హోమద్రవ్యం ఆహుతిగా నివ్వాలి. అందుకు గంధపుపొడి, కర్పూరం, అగరు, తగరు, జాజికాయ, జాపత్రి, దాల్చినచెక్క, తాళిసపత్రి, లవంగాలు, యాలకులు, తుంగముస్తలు (గడ్డలు), ఉసిరిక, నాగకేసరాలు, అశ్వగంధ, తిప్పతీగ మొదలగు మూలికలు; ద్రాక్ష, ఖర్జూరం, కిస్‌మిస్, అంజీర మొదలగు ఎండిన పండ్లు; తేనె, బెల్లం, చక్కెర మొదలగు తీపి పదార్థాలు; ఎండుకొబ్బరి, నువ్వులు, ఆక్రోటు మొదలగు నూనె గలవి; గుగ్గిలం, సాంబ్రాణి మొదలగు ధూపములు; తులసి, వేప, జమ్మి, తామర మొదలగు వాటి ఎండిన ఆకులు; గులాబి, సంపెంగ, మందార మొదలగు వాటి ఎండిన పువ్వులు ఉపయోగించవచ్చును. వీటిలో ఆయా కాలాల్లో లభించువానిలో ఆర్థిక పరిస్థితి ననుసరించి కొన్నింటిని ఎంచుకొన్న చాలును. ఇవేమియు లభింపకున్నను ఏవేని బియ్యం, గోధుమలు మొదలగు కాయ ధాన్యములు, పెసలు, మినుములు మొదలగు పప్పు ధాన్యములు పిండిగా చేసి ఆహుతులివ్వవచ్చును.

మూలికలు ఋతువులనుబట్టి ఎంచుకున్న ఇంకను గుణకారిగా ఉంటుంది. సామాన్య ప్రజల సౌకర్యం కొఱకు విద్వాంసులు అన్ని ఋతువులకు అనుకూలంగా నుండు మూలికలను కొన్నిటిని సూచించారు. వాటిని పొడిగా చేసి హవన సామగ్రి పేరుతో ఆర్యసమాజ మందిరాలలోను, ఇతర సంస్థలలోను విక్రయిస్తారు. అక్కడినుండి వాటిని పొందవచ్చును.

**4. పాత్రలు :** ఆచమనం కొరకు పంచపాత్ర (చిన్న గ్లాసు) ఉద్ధరిణి (గుంట చెంచా), ప్రోక్షిణీ పాత్ర (చేయి కడుగుకొనుటకు చిన్న పళ్లెం), ఆజ్యస్థాలి (నెయ్యి ఉంచుటకు ఒక వెడల్పు గిన్నె – అది కాడ గలిగి పట్టుకుని వేడిచేయుటకు అనుకూలంగా ఉండునది), చెంబుతో మంచినీళ్ళు ఉండాలి.

**5. మరికొన్ని చిన్న వస్తువులు :** అగ్న్యాధానం చేయుటకు కర్పూరం గాని, ఎండుకొబ్బరి పొడవైన చీలికలు గాని అవసరం. లేకున్న సన్నని రెండు సమిధలకు నేతిని రాచి వెలిగించవచ్చును. అగ్గిపెట్టె, చేతులు తుడుచుకొనుటకు చిన్న తుండుగుడ్డ ఉండాలి. అవసరమైనప్పుడు ఉపయోగించుకొనుటకు విసనకర్ర, పట్టుకారు (చిమ్టా) అందుబాటులో ఉంచుకోవాలి.

**6. యజ్ఞోపవీతం :** స్త్రీ పురుషులందరు యజ్ఞోపవీతం ధరించి యజ్ఞం

చేయుట మంచిది. అది మన ధర్మచిహ్నం. విద్యావంతుడైన ప్రతి ఆర్యుడు (వైదిక ధర్మావలంబి – హిందువు) దీనిని ధరించుటకు అర్హత గలవారై ఉన్నారు. ఈ విషయాన్ని వివరంగా తెలుసుకొనగోరువారు మాచే ప్రచురింపబడిన 'యజ్ఞోపవీత వైశిష్ట్యము' అను లఘు గ్రంథాన్ని చదువ గోరుచున్నాము. ధరించుటకు సంకోచించువారు (సాహసం చేయలేకున్న వారు) యజ్ఞోపవీతం లేకున్నను వాతావరణ శుద్ధ్యర్థం అగ్నిహోత్రం చేయవచ్చును.

**7. సమయం :** దైనిక అగ్నిహోత్రం ఉదయం సూర్యోదయానంతరమును, సాయంత్రం సూర్యాస్తమయమునకు ముందుగా చేయుట మంచిది. ఏలనన – ఉషఃకాల, సాయంకాలపు సూర్యకిరణాల ప్రభావం హోమవాయువులపైబడి ఎక్కువ లాభకారి యగునని ఆధునిక వైజ్ఞానికుల పరిశోధనలలో వెల్లడియైనది. సూర్యోదయ సూర్యాస్తమయములకు ముందు 24 ని. తరువాత 24 ని. అనగా 48 ని. ఉదయం 48 ని. సాయంత్రం అనుకూలంగా ఉంటుందని వైజ్ఞానికుల కథనం. ఆ సమయాల్లో వీలుపడకున్న పూర్తిగా చేయుట మానుట కన్న వారికి అనుకూలమైన సమయాల్లో చేసిన కొంతైనా లాభముంటుంది. విశేష హోమాలకు ఈ నియమం వర్తించదు.

**8. సంకల్పం :** మన వైదిక ధర్మంలో సంకల్పం చెప్పుకొని వైదిక కర్మలు చేయుట ఆచారం. అందువలన అనంత బ్రహ్మాండంలో మన ఆస్తిపాస్తుల అల్పత్వం, అనంతకాలంలో మన జీవితకాల స్వల్పత్వం గుర్తింపబడి అహంకారం తగ్గి ఈశ్వరభక్తి, సత్కర్మల యందు ప్రేరణ కలుగుతుంది. మన సంస్కృతి సభ్యతల పట్ల శ్రద్ధ పెరుగుతుంది. ఆధునిక ఖగోళ విజ్ఞానానికి మార్గదర్శనం చేయగల మన వైజ్ఞానిక కాలగణన గుర్తుంచుకొన్నవారమౌతాము. ఈ సంకల్పమే వ్రతధారణ – వరించిన సత్కర్మ 'వ్రతేన దీక్షా మాప్నోతి, దీక్షయాప్నోతి దక్షిణామ్' (యజు. 19–30) అని చెప్పినట్లు వ్రతధారి ముందుగా దీక్షను–పట్టుదలను పొందుతాడు. ఆ పట్టుదలయే తదుపరి అతనికి దక్షిణను – ధనమును, కీర్తిని యిస్తుంది. సాధారణంగా సంకల్పం ఈ క్రింద పేర్కొన్న విధంగా ఉంటుంది. అందు కొన్ని మార్పులు, చేర్పులు చేసుకొనవచ్చు.

'ఓం తత్ సత్ అద్య బ్రహ్మణః ద్వితీయే ప్రహరే, ఉత్తరార్ధే, శ్వేతవరాహకల్పే,

సప్తమే వైవస్వతమన్వన్తరే, అష్టావింశతితమే కలియుగే, ప్రథమ పాదే, ఏకో వృన్దః షణ్ణవతి కోట్యః అష్ట లక్షాణి, త్రి పంచాశత్ సహస్రాణి పంచవింశత్యుత్తరశత తమే (196, 08, 53, 125 (9-4-2024 యుగాది నాటికి) సృష్టి వత్సరే జంబూ ద్వీపే, భరత ఖండే, భారత వర్షే, ఆర్యావర్తే పుణ్యభూమౌ, మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య వాయవ్య ప్రదేశే, కృష్ణా గోదావర్యోః (కృష్ణా కావేర్యోః) నద్యోః మధ్యప్రదేశే, తెలంగాణ ఆంధ్రప్రదేశ్ అంతర్గతే ...... మండలే ...... నగరే ....... గ్రామే, స్వగృహే పరివార మహాజన సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానే మే దయానందాబ్దే ...... సంవత్సరే ...... ఆయనే ....... ఋతౌ ....... మాసే ....... పక్షే ....... వాసరే ....... నక్షత్రే ....... యోగే ....... కరణే ........ ఏవం గుణ విశేషేణ విశిష్టాయాం, విశిష్ఠ దివసే ....... మహర్షి గోత్రోత్పన్నః ........ నామ అహం-సర్వప్రాణి బలారోగ్య సుఖసమృధ్యర్థం, వైదిక ధర్మ రక్షణార్థం చ ప్రాతఃకాలీన / సాయంకాలీన దైనిక దేవయజ్ఞం కరిష్యే'

(ఇందు తిథి వార నక్షత్రాదులు పంచాంగం లేదా తెలుగు కేలండర్ ద్వారా తెలుసుకొనవచ్చును. యోగం, కరణం రాష్ట్రీయ పంచాంగం ద్వారా తెలియును. ఈ సృష్టి సంవత్సరం క్రీ.శ. యుగాది 2024 నాటిది).

తదుపరి ఆచమన అంగస్పర్శలు చేయవలెను. ఈ క్రింది మంత్రాదులన్నిటికి సంక్షిప్తంగా భావార్థం వ్రాయుచున్నాము. యజ్ఞక్రియ నందు భావార్థాలను చదువవలసిన అవసరం లేదు. మంత్రములు చదివిన చాలును. తీరిక సమయాలలో అర్థాలను చదివి మననం చేసుకొని క్రియల నాచరించు సమయాన ఆ భావాన్ని మనసున నిలుపుకొని చేయుచుండుట మంచిది.

## ఆచమనం

కుడి అరచేతి గుంటలో ఉద్ధరిణెడు నీళ్ళు పోసుకొని ఈ క్రింది ఒక్కొక్క మంత్రంతో ఒక్కొక్కమారుగా ముమ్మారు ఆచమనం చేయాలి.

**ఓం అమృతోపస్తరణమసి స్వాహా ।** (మొదటిసారి)

హే సర్వ సంరక్షక రక్షక ! అవినాశ స్వరూపా! ఆసనము వలె నీవు మా క్రిందివైపున వ్యాపించియుండి మమ్ము కష్టముల నుండి రక్షించుచున్నావు. స్వాహా - మా ఈ కథనం సత్యార్థోపేతము. సత్యము.

**ఓం అమృతాపిధానమసి స్వాహా ।** (రెండవసారి)

హే జగద్రక్షక! నాశరహిత ప్రభో! పైన ఉత్తరీయం వలె నీవు మా పైవైపున వ్యాపించియుండి మమ్ము కాపాడుచున్నావు.

**ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతాం స్వాహా ।** (మూడవసారి)

ఓ సర్వేశ్వర! నీ కృపవలన సత్యజ్ఞానం, కీర్తి, శోభ, సిరిసింపదలు మాయందు స్థిరంగా వసించుగాక!

## అంగస్పర్శ మంత్రములు

ఎడమ అరచేతి గుంటలో కొద్ది జలాన్ని ఉంచుకొని కుడిచేతి మధ్యమ అనామిక వ్రేళ్ళను జోడించి ఆ రెంటి చివరలను ఆ నీటియందు ముంచుచు ఈ క్రింది మంత్రాలతో వరుసగా ఆయా అవయవాలను మృదువుగా తాకవలయును. ముందు కుడివైపు తదుపరి ఎడమవైపున స్పృశించవలెను.

**ఓం వాఙ్మ అస్యేఽస్తు** (పెదవులను)

ఓ ఇంద్రియ ప్రదాత! ఈశ్వర! నీ కృపవలన నా నోటియందు వాక్‌శక్తి శక్తివంతమై స్థిరంగా నుండునుగాక!

**ఓం నసో ర్మే ప్రాణోఽస్తు స్వాహా ।** (ముక్కు పుటాలను)

నా నాసిక యందు ప్రాణశక్తి బలపడి స్థిరంగా నుండును గాక!

**ఓం అక్ష్ణో ర్మే చక్షు రస్తు ।** (కన్నులను)

నా నేత్రములందు దర్శనశక్తి స్థిరంగా నుండును గాక!

**ఓం కర్ణయో ర్మే శ్రోత్ర మస్తు** (చెవులను)

నా కర్ణముల యందు శబ్ద గ్రహణశక్తి స్థిరంగా నుండును గాక!

**ఓం బాహ్వో ర్మే బల మస్తు** (భుజములను)

నా బాహువుల యందు యశస్సు నిచ్చు బలము సదా నెలకొని యుండునుగాక!

**ఓం ఊర్వోర్మ ఓజోఽస్తు స్వాహా** (తొడలను)

నా తొడలయందు పరాక్రమము సదా స్థిరంగా నుండును గాక!

**ఓం అరిష్టాని మేఽఙ్గాని తనూ స్తన్వా మే సహ సంతు** (మిగిలిన నీరును శరీరముపై చల్లుకొనవలెను.)

నా శరీరాంగములన్నియు సదా నిరోగములై దుఃఖరహితములై దృఢముగా నుండును గాక!

## ఈశ్వర స్తుతి ప్రార్థనా ఉపాసనలు

మనమంతా ఆస్తికులము. ఈ బ్రహ్మాండమును సృజించి పాలించు విశ్వ వ్యాపకమైన ఒక మహత్తర శక్తి – పరమేశ్వరుడు గలడని విశ్వసింతుము. ఆస్తికులు తమ ధార్మిక కర్మలు ప్రారంభించేముందు ఈశ్వర స్తుతి ప్రార్థనోపాసనలు చేయుట ఆచారము. అగ్నిహోత్రము ఒక ధార్మిక కర్మ. అందుచే పరమేశ్వర ప్రార్థనతో ప్రారంభించుట సదాచారము. ఈశ్వర స్తుతి వలన అతని గుణగణములు అవగతమై అతనియందు మనకు శ్రద్ధాభక్తులు ఇనుమడిస్తాయి. ప్రార్థన వలన మన అల్పత్వము, అల్ప శక్తిమత్వము తెలిసి అహంభావము తొలగును. ఉపాసన వలన – ధ్యాన తన్మయత వలన ఆనందానుభూతి కలుగును. ఈ స్తుతి ప్రార్థనలు ఏవో మానవ నిర్మిత శ్లోకములతోగాక, ఈశ్వర ప్రదత్త వేద మంత్రాలతో గావించుట శ్రేష్ఠము గాన ఋషి నిర్దేశితమైన కొన్ని వేద మంత్రాలతో స్తుతి ప్రార్థనలు చేయుదము రండు.

**ఓం విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ ।**

**యద్ భద్రం తన్న ఆసువ ॥** – యజు. 30–3

హే దేవ సవిత! సృష్టికర్తవైన పరమేశ్వర! నీవు కృపతో మాలోని సమస్త దుర్గుణాలను, దుర్వ్యసనాలను, దుఃఖాలను దూర మొనర్పుము. ఏది భద్రమో, శుభమును చేకూర్చునో అట్టి గుణకర్మ స్వభావాలను, పదార్థాలను మాకు ప్రసాదింపుము.

**ఓం హిరణ్యగర్భః సమవర్త తాగ్రే**

**భూతస్య జాతః పతిరేక ఆసీత్ ।**

**స దాధార పృథివీం ద్యా ముతేమాం**

**కస్మై దేవాయ హవిషా విధేమ ॥** – యజు. 17–4

సృష్టికి పూర్వం (ప్రళయ కాలమున) సూర్యాది జ్యోతిస్సులను బీజరూపంలో

హిరణ్యగర్భుడు (పరమేశ్వరుడు) తన గర్భమున ధరించి ఉండెను. అతడే సృష్టిలోని సమస్త పదార్థాలను ఎవరి సహాయం లేకుండానే సృజించి పాలించుచున్నాడు. అతడు ఒక్కడే, అతని ఆధారముననే ఈ పృథివీ ద్యులోకములు వాటి వాటి స్థానమున పరిభ్రమించుచున్నవి. అట్టి సుఖస్వరూపుడైన పరమేశ్వరునకు సత్కర్మలనెడు హవిస్సు నర్పించి నమస్కరించుచున్నాము.

**ఓం య ఆత్మదా బలదా, యస్య విశ్వ ఉపాసతే,**
**ప్రశిషం యస్య దేవాః ।**
**యస్య చ్ఛాయామృతం యస్య మృత్యుః**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥** - యజు. 25-13

ఎవడు వేదము ద్వారా ఆత్మ జ్ఞానమును, పురుషార్థ సాధన జేయగల శరీరేంద్రియ మనోబలములను ఒసంగుచున్నాడో, ఎవనిని ముముక్షువులందరు ఉపాసించుచున్నారో, ఎవని ఆజ్ఞలను (వేదాదేశములను) విద్వాంసులు పాలింతురో, ఎవని ఆశ్రయం మోక్షరూపసుఖ దాయకమో, ఎవని అనాశ్రయం మరణరూప దుఃఖదాయకమో అట్టి సుఖ స్వరూపుడైన పరమాత్మను శుద్ధాంతఃకరణమను హవిస్సునర్పించి ఉపాసింతుము గాక!

**ఓం యః ప్రాణతో నిమిషతో మహిత్వైక**
**ఇద్రాజా జగతో బభూవ ।**
**య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥** - యజు. 23-3

ఎవడు ప్రాణి అప్రాణి జగత్తున కంతకు తన మహిమతో ఏకైక రాజుగా విరాజిల్లుచున్నాడో, ఎవడు ద్విపాద చతుష్పాదాది ప్రాణుల శరీరరచన గావించుచున్నాడో, అట్టి సుఖస్వరూప పరమేశ్వరునకు భక్తితో, పురుషార్థ సాధన సంపత్తి యను హవిస్సు నర్పించి నమస్కరించుచున్నాము.

**ఓం యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా**
**యేన స్వః స్తభితం యేన నాకః ।**
**యో అంతరిక్షే రజసో విమానః**
**కస్మై దేవాయ హవిషా విధేమ ॥** - యజు. 32-6

ఎవనిచే తీక్షణ స్వభావము గల సూర్యాది లోకములు మరియు ఈ

భూమియు దృఢముగా ధరింపబడియున్నవో, ఎవనిచే స్వర్గము - సుఖము ధరింపబడియున్నదో, ఎవడు మోక్షము నొసంగునో, ఎవడు ఆకాశమున సమస్త లోక లోకాంతరములను నిర్మించి త్రిప్పుచున్నాడో, అట్టి సుఖదాయక పరమేశ్వరునకు పూర్ణ పురుషార్థరూప హవిస్సుతో నమస్కరించుచున్నాము.

**ఓం ప్రజాపతే! నత్వదేతా న్యన్యో**
**విశ్వా జాతాని పరితా బభూవ ।**
**య త్కామాస్తే జుహుమ స్తన్నో అస్తు**
**వయం స్యామ పతమో రయీణామ్ ॥** - ఋగ్వేదం. 10-121-10

ఓ ప్రజాపతీ! పరమేశ్వర! ఈ సమస్త ఉత్పన్న పదార్థాలను వశం చేసుకొనగలవాడు నీకన్న మరియొకడు లేడు. నీ కృప వలన ఏఏ కోరికలతో మేము నిన్ను భజింతుమో అవి మాకు సిద్ధించును గాక! మేము ధనైశ్వర్యాలకు స్వాముల మగుదుము గాక!

**ఓం స నో బంధు ర్జనితా స విధాతా**
**ధామాని వేద భువనాని విశ్వా ।**
**యత్ర దేవా అమృత మానశానా**
**స్తృతీయే ధామ న్నధ్యైరయన్త ॥** - యజు. 32-10

ఆ పరమేశ్వరుడే మనకు బంధువు. జనకుడు, కర్మఫల ప్రదాత. సమస్త ధామములను - భువనములను - లోకములను ఎరిగినవాడు. ఎవనిలో ముక్తులు మోక్షసుఖము ననుభవించుచు తృతీయ ధామమున స్వేచ్ఛాపూర్వకంగా విహరింతురో అట్టి దేవదేవునికి మా వందనములు.

**ఓం అగ్నే! నయ సుపథా రాయే అస్మాన్**
**విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।**
**యుయోధ్యస్మ జ్జుహురాణి మేనో**
**భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥** - యజు. 40-16

హే అగ్నే! ప్రకాశ స్వరూప ప్రభో! ధనప్రాప్తికై మమ్ము మంచి మార్గాన నడుపుము. ఓ దేవ! మా సమస్త కర్మలను నీవెరుగుదువు. మాలోని కుటిలమైన పాపభావాలను పాప కర్మలను దూరం చేయుము. అందుకొరకే నిన్ను అత్యంత భక్తితో వేడుకొనుచు నమస్కరించుచున్నాము.

## అగ్న్యాధానము

పై స్తుతి ప్రార్థనోపాసనల అనంతరం, యజ్ఞకుండం నందు అగ్నిస్థాపన చేయవలసి యుండును. సేకరించుకున్న మంచి ఎండు సమిధలను హవన కుండమున చక్కగా పేర్చుకొనవలెను. తదుపరి నేతిలో ముంచిన రెండు సన్నటి కొనగలిగిన సమిధలను ఈ క్రింది వాక్యమును చదివి వెలిగించవలెను. లేదా కర్పూరముతో గాని లేక ఎండు కొబ్బరి చీలికలతో గాని వెలిగింపవచ్చును.

**ఓం భూర్భువః స్వః** (గో.గృ.సూ. 1-1-11)

హే రక్షక! సచ్చిదానంద స్వరూప! నీ సృష్టి అత్యద్భుతము. నీవు ప్రాణి మనుగడ కొరకు భూలోకమున అగ్నిని, భువర్ లోకమున (అంతరిక్షమున) స్థిరవిద్యుత్తును, స్వర్ లోకమున సూర్యుని సృజించిన దేవ దేవుడవు. నీకు మా వందనములు.

తదుపరి యీ క్రింది మంత్రము నుచ్చరించి వెలిగించిన అగ్నిని హవనకుండపు మధ్యన నుంచవలెను.

**ఓం భూర్భువః స్వర్ద్యౌరివ భూమ్నా పృథివీవ వరిమ్ణా**
**తస్యాస్తే పృథివి దేవయజని ।**
**పృష్ఠేఽగ్నిమన్నాదమన్నాద్యా యాదధే ॥** - యజు. 3-5

ఓ దేవ యజని! పృథివ్యాది దేవతలను సంస్కరించు ఓ యజ్ఞకుండమా! భూర్ భువర్ స్వర్ లోకాల ప్రతినిధియైన ఈ యజ్ఞాగ్ని ద్యులోక సమాన మహత్తు గలది. పృథివీ సమాన శ్రేష్ఠత్వం గలది. హవ్య పదార్థాలను సూక్ష్మాతి సూక్ష్మం చేయగల శక్తి గలది. అట్టి దివ్యగుణాలు గల అగ్నిని అందుకొరకే - మే మర్పించు హవ్యములను సూక్ష్మీకరించుట కొరకే నీ మధ్యమున ఉంచుచున్నాము.

## అగ్ని సమింధనము

'అగ్ని సమింధన' మనగా అగ్ని నుత్తేజింప జేయుట - చక్కగా జ్వలింపజేయుట. స్థాపన చేసిన అగ్నిపై సన్నటి సమిధలను పేర్చిన చక్కగా జ్వలించును. అవసరమైన విసనకర్రతో నెమ్మదిగ విసరవచ్చును. కాని, నోటితో నూదరాదు.

**ఓం ఉద్బుధ్యస్వాగ్నే, ప్రతిజాగృహి**
**త్వమిష్టాపూర్తే సం సృజేథా మయం చ ।**
**అస్మిన్ సధస్థే అధ్యుత్త రస్మిన్**
**విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥** - యజు. 15-54

ఓ యజ్ఞాగ్నీ! నీవు చక్కగా ప్రకాశించుము. ఉన్నతముగా జ్వలించుము. నీవును, యజ్ఞకర్తయైన యజమానియు ఇష్టాపూర్తములను (హవిర్యజ్ఞ సోమయజ్ఞములను) చక్కగా సంపన్నము చేయుదురు గాక! ఈ యజ్ఞశాల యందును, ఉత్తరమందున్న సోమయజ్ఞశాల యందును విద్వాంసులు (బ్రహ్మ ఋత్విక్ అధ్వర్యు ఉద్గాతాది విద్వాంసులు) మరియు యజ్ఞకర్తలు చక్కగా ఆసీనులగుదురు గాక!

**వ్యాఖ్య :** కొన్ని పెద్ద పెద్ద యజ్ఞములందు హవిర్ యజ్ఞంతోబాటు అనగా మనము చేయబోవు ఇట్టి యజ్ఞంతోబాటు సోమయజ్ఞమును యజ్ఞకుండమునకు కొద్ది దూరంలో ఉత్తరమువైపున నిర్వహింతురు. దైనిక అగ్నిహోత్రమునకు అట్టి రెండు యజ్ఞవేదు లవసరములేదు.

## సమిధాధానము

సమిధాధాన మనగా 3 విశేష సమిధలను శ్రద్ధతో యజ్ఞకుండమున నుంచుట. ఇందుకు సేకరించుకున్న మామిడి, మోదుగ, చందనము మున్నగు కట్టెలలో వంకర టింకరలు లేని సుమారు 8 అం॥ పొడవు గల మూడు చక్కటి సమిధల నేరుకొనవలెను. వాటికి ఒకవైపు చివరలను నేతిలో ముంచి ఈ క్రింది మంత్రముల నుచ్చరించుచు చివరి స్వాహాకారంతో అగ్నికుండమున నొక్కొక్కటిగ నుంచవలెను.

**ఓం ఆయంత ఇధ్మ ఆత్మా జాతవేద**
**స్తేనేధ్యస్వ వర్ధస్వచేద్ధ వర్ధయ చాస్మాన్ ।**
**ప్రజయా పశుభిర్ బ్రహ్మవర్చసే నాన్నాద్యేన**
**సమేధయ - స్వాహా ॥**
**ఇద మగ్నయే జాతవేదసే - ఇదం న మమ ॥**

- ఆశ్వలాయన గృహ్యసూత్రాలు 1-1-12

– అని మొదటి సమిధ కుండమున నుంచవలెను.

ఓ జాతవేదాగ్నీ! ఈ ప్రకాశమునిచ్చు సమిధ నీకు ఆత్మ – ఆధారము. కావున దీనిచే నీవు గొప్పగా ప్రకాశింపుము. మిక్కిలిగా ప్రజ్వరిల్లుము. నీ వలె మమ్ము కూడ ఉత్తమ సంతానంతోను, గో అశ్వాది పశుగణంతోను, బ్రహ్మ వర్చస్సుతోను– వేదజ్ఞానంతోను, అన్నాది పదార్థాల ననుభవించగల ఇంద్రియ పటుత్వంతోను, శారీరక ఆత్మిక ఉన్నతులతో కూడిన సర్వతోముఖ వృద్ధితోను నిశ్చయంగ మమ్ము వర్ధిల్లజేయుము. స్వాహా – మా యీ కథనము సత్యోపేతమగును గాక! శ్రద్ధతో మే మిచ్చు ఆహుతిని స్వీకరింపుము.

ఈ ఆహుతి ఉత్పన్న పదార్థముల యొక్క ప్రకాశకుడగు జాతవేదాగ్ని కొరకే. నా కొరకు కాదు. ఇది నాది కాదు. నేను సృజించినది కాదు. పరమేశ్వర నిర్మితమే. (ఇట్టి స్వాహాకారము ప్రతి ఆహుతి చివర చెప్పుట జరుగును. దీనివల్ల అహంకార త్యాగము – తద్వారా ఈశ్వరప్రాప్తి కలుగును.)

**ఓం సమిధాగ్నిం దువస్యత, ఘృతైర్బోధయతాతిథిమ్,**
**ఆస్మిన్ హవ్యా జుహోతన స్వాహా ॥** – యజుర్వేదం 3–1
**ఇద మగ్నయే – ఇదం న మమ.**

**ఓం సుసమిద్ధాయ శోచిషే, ఘృతం తీవ్రం జుహోతన,**
**అగ్నయే జాతవేదసే – స్వాహా** – యజుర్వేదం 3–2
**ఇదమగ్నయే జాతవేదసే – ఇదం న మమ.**

యీ రెండు మంత్రాలతో రెండవ సమిధ నుంచవలెను.

**పరమేశ్వరుని ఉపదేశము :**

ఓ మానవులారా! సమిధలతో అగ్నిని చక్కగా జ్వలింపజేయుడు. అతిథిని (తిథి లేక దేశ సంచారం చేయుచు ధర్మోపదేశం జేయు సాధు సంన్యాసులను) ఆహారాదు లొసగి శ్రద్ధాభక్తులతో సేవించునట్లు యీ యజ్ఞాగ్నిని ఘృతంతో సేవింపుడు. అట్లు ప్రదీప్తమైన అగ్నియందు హవనీయ పదార్థాలను హోమం చేయుడు.

చక్కగా ప్రదీప్త మొనర్చబడినదియు, శోచిషే – అన్నింటిని సంస్కరించ గలదియు, జాతవేదసే – ఉత్పన్న వస్తువులను ప్రకాశింపజేయగలదియు నగు

అగ్నికి తీవ్ర ఘృతమును అనగా వేడిచేసి చక్కగా కరిగించిన నేతిని శక్తికొలది అధికముగ ఆహుతుల నిండు. (శక్తి గలవారు కస్తూరి, కేసరి మొదలగు వాటిని కరిగిన నేతిలో కలుపవచ్చును.)

ఆహుతుల తదుపరి ఉచ్చరించే 'స్వాహా, ఇదం న మమ' మాటలకర్థం పూర్వం వివరించినట్లే గ్రహింపవలెను.

**ఓం తన్త్వా సమిద్భి రంగిరో, ఘృతేన వర్ధయామసి**
**బృహచ్ఛోచా యవిష్ఠ్య - స్వాహా** - యజుర్వేదం 3-3
**ఇద మగ్నయేఽంగిరసే - ఇదం న మమ ॥**

అని యజ్ఞకుండమున మూడవ సమిధ నుంచవలెను.

ఓ అంగిరాగ్నీ! ప్రసిద్ధమగు నిన్ను సమిధలతో, నేతితో వృద్ధి పరచుచున్నాము. దానితో నీవు ఉన్నత శిఖలను బొంది మా హవిస్సులను యవిష్ఠ్య - అణువులుగా, పరమాణువులుగా మార్చుదువు గాక!

**వ్యాఖ్య :** ఈ సమిధాధానంలో మొదటి సమిధ నుంచుచు **'ఇదమగ్నయే ఇదన్నమమ'** అని చెప్పుదుము. ఇది భూలోక మందున్న సామాన్య అగ్నికి వర్తించును. దాని శక్తి పరిమితం. రెండవ సమిధ నుంచుచు **'ఇదమగ్నయే జాతవేదసే'** అని చెప్పుదుము. ఇది అంతరిక్ష మందున్న జాతవేదాగ్నికి చెందును. అంతరిక్షంలో స్థిర విద్యుత్తురూపాన అగ్ని యుండును. అది ఉత్పన్న పదార్థాలను ప్రకాశింపజేయును. అనగా కనబడునట్లు జేయును. గాన, అది జాత - పుట్టిన వాటిని, వేదః - తెలుపునది. దాని శక్తి భూలోకాగ్ని కన్న కొంత విశాలం. ఇక మూడవ సమిధ నుంచుచు **'ఇదమగ్నయే అంగిరసే'** అని చెప్పుదుము. ఇది ద్యులోకమందున్న అంగిరాగ్నికి వర్తించును. ద్యులోక మందున్న అగ్నిని అంగిరాగ్ని యందురు. అనగా **'ప్రతి వస్తువును ప్రాప్తించున'**దని అర్థం. అది సూర్యుడు కేంద్రంగా సూర్య కుటుంబానికంతకు వ్యాపించును. ఆ అగ్నియే ప్రాణులన్నిటిని చైతన్యవంతం చేయుచుండును. వృక్షాల ద్వారా స్వీకరింపబడి ప్రాణుల కాహారమై పనిచేయు శక్తి నిచ్చుచుండును. మేఘాల నిర్మాణానికి, షడ్ ఋతువుల సమతుల్యతకు అదియే ముఖ్య కారణం. అట్టి అంగిరాగ్నికి ఆహుతి నర్పించవలెనన్న మంటను ఉన్నతం గావింపవలసి యుండును. అట్టి ప్రజ్వలితాగ్ని 'యవిష్ఠ' యగును. అట్టి అగ్నియే హోమ ద్రవ్యాలను సూక్ష్మతమముగా - అణువులుగా పరమాణువులగా

మార్పుగలుగును. అప్పుడా సూక్ష్మద్రవ్యం భూమ్యాకర్షణ పరిధిని దాటిపోయి ద్యులోకాన సూర్యుని సంస్కరింప సమర్థవంతమగును.

## పంచ ఘృతాహుతులు

ఈ క్రింది మంత్రాన్ని 5 సార్లు చదివి, 5 ఆహుతులు ఘృతంతో నివ్వవలెను.

**ఓం ఆయన్త ఇధ్మ ఆత్మా జాతవేద**
**స్తేనేద్ధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్**
**ప్రజయా పశుభిర్బ్రహ్మ వర్చసే**
**నాన్నా ద్యేన సమేధయ - స్వాహా**
**ఇదమగ్నయే జాతవేదసే - ఇదం న మమ.**

దీని భావార్థం పూర్వమే (సమిధాధాన మంత్రాలలో) వ్రాయబడినది. అచ్చట ఇధ్మ పదానికి సమిధ అను అర్థం చెప్పుకొనుట జరిగినది. ఇచ్చట ప్రకరణమునుబట్టి ఇట్టి ఇధ్మ పదమునకు నెయ్యి అనునర్థం చెప్పుకొనవలెను. ఒకే మంత్రం 5 సార్లు చదివి 5 ఆహుతులిచ్చుటకు కారణ మేమన - ఈ మంత్రమునందు 5 కోర్కెలు (1. ఉత్తమ సంతానం, 2. గో అశ్వాది పశుగణం, 3. బ్రహ్మ వర్చస్సు, 4. అన్నాది భోజ్య వస్తువుల ననుభవింపగల ఇంద్రియ పటుత్వం, 5. సర్వతోముఖ ఉన్నతి) కోరబడినవి. అందుచే పంచ ఘృతాహుతులిచ్చు విధాన మేర్పర్చబడినదని కొందరు విద్వాంసుల కథనం.

## జల ప్రసేచనము

ఈ క్రింది మంత్రాలతో అగ్నికుండానికి నలువైపుల క్రమంగా తూర్పు, పడమర, ఉత్తర, దక్షిణ దిక్కులందు ఆయా క్రమాలలో నీళ్ళు చిలుకరించవలెను. లేదా పోయవలెను.

**ఓం అదితేఽ నుమన్యస్వ.**

సంయోగింప జేయగల ఓ జలమా! ఈ యజ్ఞాగ్నికి అనుకూలంగా నుండి తూర్పు దిశనుండి కాపాడుచుండుము. (ఈ మంత్రంతో యజ్ఞకుండానికి తూర్పు దిక్కున దక్షిణము నుండి ఉత్తరానికి నీటిని పోయవలెను - చిలకరించవచ్చును.)

**ఓం అనుమతేఽనుమన్యస్వ.**

అన్నిటికి అనుకూలంగా నుండు ఓ జలమా! పశ్చిమ దిశ యందుండి ఈ

యజ్ఞాగ్నిని కాపాడుము. (పడమట వైపున దక్షిణం నుండి ఉత్తరానికి)

**ఓం సరస్వత్యనుమన్యస్వ.** - గోభిలాయన గృహ్యసూత్రాలు 1-3-1,2,3

గతివంతమై ప్రవహించు ఓ జలమా! ఉత్తర దిశయందుండి ఈ యజ్ఞాగ్నిని కాపాడుము (ఉత్తర దిక్కునందు పడమర నుండి తూర్పునకు)

**ఓం దేవ సవితః ప్రసువ యజ్ఞం**
**ప్రసువ యజ్ఞపతిం భగాయ ।**
**దివ్యో గంధర్వః కేతపూః కేతం**
**నః పునాతు వాచస్పతిర్వాచం నః స్వదతు ॥** - యజు. 3-1

ప్రేరకగుణం గల ఓ దివ్య జలమా! మా యజ్ఞాన్ని ప్రేరేపింపుము. ఐశ్వర్య ప్రాప్తికై యజ్ఞపతియైన యజమానుని ప్రేరేపింపుము. దివ్య శక్తులతో కూడి భూమిని ధరించియున్న ఓ జలమా! నీవు శరీరములను పవిత్రం (ఆరోగ్యవంతం) చేయుదానవు. గాన, మా శరీరాలను పవిత్రపరతువు గాక. మా వాణిని మధురం చేయుదువు గాక!

(ఈ మంత్రంతో దక్షిణం నుండి ప్రారంభించి యజ్ఞకుండానికి నలువైపుల జలమును చిలకరించవలెను)

**వ్యాఖ్య :** ఈ మంత్రంలో నీటి గుణాలు కీర్తింప (వర్ణింప) బడినవి. నీరు **'ప్రసువ యజ్ఞం'** - యజ్ఞమును ప్రేరేపించును. అందుచేతనే ఋషులు ఆచమనక్రియతో యజ్ఞము నారంభించు విధాన మేర్పరచిరి. ఇంతేగాక, ఈ యజ్ఞకార్యము నందును జలము ఆవశ్యకమే. పూర్వ పుటలలో తెలుపబడినట్లు యజ్ఞవాయువు నందలి ముఖ్య వాయువులైన ఫార్మల్‌డీహైడ్ మొదలగునవి. నీటియావిరితో కలిసి యున్నప్పుడే ఎక్కువ గుణకారిగా నుండును. దీనితోపాటు అగ్ని యున్నచోట జల మవసరమగును. కొందరు చీమలు మొదలగు అల్పప్రాణులు యజ్ఞవేదిక సమీపానికి వచ్చి చనిపోకుండుటకు ఈ క్రియ చేయబడునందురు. అదియును సమంజసంగానే యున్నది. ఏలనన అగ్నిహోత్రానికి 'అధ్వర'మని పేరు. అనగా 'హింసలేని పవిత్ర కర్మ' అని అర్థం. అందుకే ఈ క్రియతో ఆజాగ్రత్తను గుర్తించిన వారమగుదుము. మరికొందరు భూమిచుట్టూ నీరు (సముద్రాలు) ఉన్నట్లే దానికి ప్రతీకగా యజ్ఞకుండం చుట్టూ నీరుపోయుట జరిగినదని అందురు.

ధనం గలవాడే చక్కగా యజ్ఞమునాచరింప గలడు. అందుచేతనే **'ప్రసువ**

**యజ్ఞ పతిం భగాయః'** ఐశ్వర్య ప్రాప్తికై యజ్ఞపతికి ప్రేరణ నిమ్మని కోరుట జరిగినది. భూమికి నాలుగువైపుల సముద్ర మున్నది. అందువలననే భూ వాతావరణం ప్రాణి మనుగడ కనుకూలంగా నున్నది. అందుచే నీరు **గంధర్వః (గామ్-పృథివీం ధరతి ఇతి గంధర్వః)** గామ్ – భూమిని, ధర్వః – ధరించినది. అది దివ్యమైనది. ఆ నీరు **కేతపూః –** శరీరములకు లోపల బయట పవిత్రం చేయును గాన **'నః కేతుమ్ పునాతు' –** మా శరీరాలను పవిత్రం చేయవలెనని కోరుట జరిగినది. నీరు **వాచస్పతిః –** స్వర పేటికను పాలించునది. మాట్లాడునపుడు రూక్షత రాకుండ కాపాడును గాన **'నః వాచమ్ స్వదతు'** మన వాణిని మధురం చేయ గోరితిమి.

## అఘూరావాజ్య భాగాహుతులు

అఘూరా అనగా ఒక విశేష పద్ధతిలో నేతితో ఆహుతి నిచ్చుట. ఆ పద్ధతి ఏమన – యజ్ఞవేది యందలి అగ్నిలో పడమటి నుండి తూర్పునకు ధారగా, పొడవుగా, సరళరేఖ వలె రెండు ఆహుతులు. ఒకటి ఉత్తర భాగాన, రెండవది దక్షిణ భాగాన ఇవ్వవలెను. దీనినే శాస్త్రాలు **'ఋజు మాఘూరయతి, దీర్ఘ మాఘూరయతి, సంతత మాఘూరయతి'** యని చెప్పును.

**ఓం అగ్నయే స్వాహా,**

**ఇద మగ్నయే – ఇదం న మమ** – యజు. 22-27

(ఉత్తరపు వైపు అగ్నియందు పైవిధంగా)

ప్రకాశ, తీక్ష్ణ గుణాలు గల అగ్నికి ఈ ఆహుతి నర్పించుచున్నాను.

**ఓం సోమాయ స్వాహా,**

**ఇదం సోమాయ – ఇదం న మమ.** – యజు. 22-28

దక్షిణ దిక్కున పడమర నుండి తూర్పునకు ఆహుతినర్పించవలెను. సౌమ్య, శాంత గుణాలు గల అగ్నికి ఈ ఆహుతి నర్పించుచున్నాను.

**వ్యాఖ్య :** యజ్ఞవేధిని భూమికి అన్వయించుటకు గాను ఋషులు ఈ విధాన మేర్పరచి యుందురు. భూమి యొక్క ఉత్తర, దక్షిణ ధృవములందు అయస్కాంత ధృవములున్నట్లే, వాటి గుణాలను తెలుపునట్లుగా ఈ క్రియా విధాన మేర్పరచిరి. ఉత్తర ధృవము ధన విద్యుత్‌తో అగ్నివలె నుండును. దక్షిణ ధృవము ఋణ విద్యుత్‌వలె సౌమ్యంగా నుండును. భూమి పడమటి నుండి తూర్పునకు పరిభ్రమించుచుండును. గాన దాని కనుగుణంగానే ఈ ఆహుతుల క్రియా విధానం

కూడా పడమటి నుండి తూర్పునకు ధారగా వేయునట్లేర్పర్చబడినది.

## ఆజ్య భాగాహుతులు

ఈ క్రింది మంత్రాలతో యజ్ఞాగ్ని మధ్యభాగాన నేతితో ఆహుతులీయవలెను.

**ఓం ప్రజాపతయే స్వాహా ।**

**ఇదం ప్రజాపతయే - ఇదం న మమః** - యజు. 18-27

ప్రజలను పాలించు - పోషించు అగ్నికొరకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం ఇంద్రాయ స్వాహా**

**ఇద మింద్రాయ - ఇదం న మమ** - యజు. 22-28

వివిధ ఐశ్వర్యాల నిచ్చు అగ్నికొరకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

**వ్యాఖ్య :** ఈ రెండాహుతులు అగ్నిహోత్రం యొక్క ముఖ్య గుణాలను తెలుపుచున్నవి. అగ్నిహోత్రం ప్రజలను ఆరోగ్యవంతులుగా, బలవీర్యవంతులుగా జేయును. గాన, ఇది ప్రజాపతి. దీని ద్వారా ఎన్నెన్నో ఐశ్వర్యాలను బొందవచ్చును. ఇంతేగాక, ఇది పుత్రేచ్ఛ, వర్ఛేచ్ఛ, సామ్రాజ్యేచ్ఛ మొదలగు ఎన్నెన్నో కోరికలను తీర్చును. కాన ఇది ఇంద్రుడనబడును.

## దైనిక అగ్నిహోత్ర ప్రధాన ఆహుతులు

ఈ ఆహుతు లిచ్చు మంత్రాలు ఉదయ సాయంకాలాలకు వేరు వేరుగా నుండును. ఏ కాలమున కా మంత్రాలతోనే హోమం చేయవలెను. నేతి ఆహుతులతోబాటు మరొకరు పూర్వం సూచింపబడిన హోమద్రవ్యాలలో నేవేని కొన్నిటిని స్వాహా కారంతో ఆహుతిగా నివ్వవలెను. ఒక్కరే చేయుచున్నచో నేతి ఆహుతి నిచ్చి తదుపరి హోమద్రవ్యంతో ఆహుతి నివ్వవచ్చును.

## ప్రాతఃకాల ఆహుతులు

**ఓం సూర్యో జ్యోతిర్జ్యోతిః సూర్యః స్వాహా**

సూర్యుడు ప్రకాశ స్వరూపుడు. ప్రకాశమే సూర్య స్వరూపం. ఆ ప్రకాశమునకే ఈ ఆహుతి.

**ఓం సూర్యో వర్చో జ్యోతిర్వర్చః స్వాహా**

సూర్యుడు వర్చ స్వరూపుడు. ప్రకాశమే అతని వర్చస్సు. ఆ వర్చస్సునకే

ఈ ఆహుతి.

**ఓం జ్యోతిః సూర్యః సూర్యో జ్యోతిః స్వాహా**

జ్యోతియే సూర్యుడు. సూర్యుడే జ్యోతి. ఆ సూర్యునికే ఈ ఆహుతి.

**ఓం సజూ ర్దేవేన సవిత్రా సజూ రుషసేంద్రవత్యా**
**జుషాణః సూర్యో వేతు స్వాహా** - యజు. 3-9, 10

సవితా దేవునిచే సృష్టించబడి ఈ జగత్తుతో సదా వర్తమానుడై యుండి, ప్రకాశవంతమగు ఉషఃకాలంతో కూడినవాడై అంతటా ప్రకాశించు సూర్యునకు ఈ ఆహుతి నర్పించుచున్నాను.

## సాయంకాల ఆహుతులు

**ఓం అగ్నిర్జ్యోతి ర్జ్యోతిః రగ్నిః స్వాహా**

అగ్ని ప్రకాశ స్వరూపుడు. ప్రకాశమే అగ్ని స్వరూపం. ఆ ప్రకాశాగ్నికే ఈ ఆహుతి.

**ఓం అగ్ని ర్వర్చో జ్యోతి ర్వర్చః స్వాహా**

అగ్ని వర్చఃస్వరూపుడు. ప్రకాశమే అతని వర్చస్సు. ఆ వర్చస్వాగ్నికే ఈ ఆహుతి.

**ఓం అగ్ని ర్జ్యోతి ర్జ్యోతి రగ్నిః స్వాహా** (మౌనంగా)

(మొదటి మంత్రమే ఇచట పునరావృతమైనది. అందుచే మనస్సులోనే ఈ మంత్రం నుచ్చరించి మౌనంగా ఈ ఆహుతి నీయవలెను. అర్థం మొదటి మంత్రానికి వలెనే గ్రహించవలెను.)

**ఓం సజూర్దేవేన సవిత్రా సజూ రాత్ర్యేంద్రవత్యా**
**జుషాణో అగ్నిర్వేతు స్వాహా** - యజు. 3-9,10

సవితచే - సృష్టికర్తయైన పరమేశ్వరునిచే సృజింపబడి యీ జగత్తుతో సమానంగా వర్తమానమై యుండి, రాత్రులందు తారా చంద్ర విద్యుత్ కాంతులతో కూడినదై అంతటా వ్యాపించి యుండు అగ్నికొరకు ఈ ఆహుతి నర్పించుచున్నాను.

**వ్యాఖ్య :** దినమంతయు సూర్యుని వలన, రాత్రంతయు జాతవేదాగ్ని వలన స్థావర జంగమ ప్రాణులన్నియు ప్రకాశమును, వర్చస్సును బొందుచుండును. అవి లేకున్న కాంతి విహీనములై గాఢాంధకారమున చైతన్యరహితమై పడియుండును. వాటిని సంస్కరించి చైతన్యవంతము చేయగల శక్తి

అగ్నిహోత్రానికున్నది. అందుచే దిన ప్రారంభమైన ఉషఃకాలమునందు సూర్యునికి, రాత్రి ప్రారంభము కాబోతున్న సూర్యాస్తమయ సమయమున అగ్నికి ఈ ఆహుతులనిచ్చుట జరిగినది.

## ప్రాతస్సాయం సమయములందు ఇచ్చు ఆహుతులు

ఉదయం చేసినను, సాయంత్రం చేసినను ఈ క్రింది మంత్రములన్నిటితో నేతిని, హోమద్రవ్యమును కూడ ఆహుతులుగా నివ్వవలెను.

**ఓం భూరగ్నయే ప్రాణాయ స్వాహా**
**ఇద మగ్నయే ప్రాణాయ – ఇదం న మమ**

శరీరమున ప్రాణవాయువు వలె భూలోక మందుండు అగ్నికి ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం భువ ర్వాయవేఽపానాయ స్వాహా**
**ఇదం వాయవేఽపానాయ – ఇదం న మమ**

మల మూత్రాదుల బోనాడు అపాన వాయువువలె కాలుష్య నివారణ చేయుచు భువర్లోకమున (అంతరిక్షమున) నుండు వాయువునకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం స్వ రాదిత్యాయ వ్యానాయ స్వాహా**
**ఇద మాదిత్యా వ్యానాయ – ఇదం న మమ**

శరీరము నందంతటను వ్యాపించుచు సుఖమునిచ్చు వ్యానవాయువు వలె ద్యులోకమున నుండు సూర్యునకు యీ ఆహుతి నిచ్చుచున్నాను.

**ఓం భూర్భువః స్వ రగ్ని వాయ్వాదిత్యేభ్యః**
**ప్రాణాపానవ్యానేభ్యః స్వాహా**
**ఇద మగ్ని వాయ్వాదిత్యేభ్యః**
**ప్రాణాపానవ్యానేభ్యః – ఇదం న మమ.**

శరీరము నందలి ప్రాణపాన వ్యానముల వలె భూ భువర్ స్వర్ లోకములోని అగ్ని వాయు ఆదిత్యుల కొరకు ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

## ఈశ్వర ప్రార్థనతో ఆహుతులు

**ఓం ఆపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువః స్వరోం స్వాహా**

ఓ పరమేశ్వరా! నీవు ఆపః = అంతటా వ్యాపించి యుండువాడవు. జ్యోతిః = ప్రకాశ స్వరూపుడవు. రసః = ప్రేమరస స్వరూపుడవు. అమృతం = నాశరహితుడవు. బ్రహ్మ = అన్నిటికన్న గొప్పవాడవు. భూర్భువః స్వః = సచ్చిదానంద స్వరూపుడవు. ఓ3మ్ = సర్వ సంరక్షకుడవు. స్వాహా = అట్టి నీ కొరకే ఈ ఆహుతి నర్పించుచున్నాను. (ఈ ఆహుతిని సమర్పణ ఆహుతి యని కూడ అనవచ్చును) సత్కర్మల ఫలమును శ్రద్ధా భక్తులతో ఈశ్వరార్పణ చేయుట వైదిక శిష్టాచారం.)

**ఓం యాం మేధాం దేవగణాః పితర శ్చోపాసతే ।**

**తయా మా మద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా ॥** - యజు. 32-14

ఓ అగ్నే! ప్రకాశ స్వరూప పరమేశ్వర! ఏ మేధస్సును - శ్రేష్ఠబుద్ధిని విద్వాంసులు, జ్ఞానులు ఉపాసించుచున్నారో - కోరుచున్నారో అట్టి మేధాబుద్ధితో ఇప్పుడే నన్ను మేధావంతుని జేయుము. స్వాహా - ఈ కథనం సత్యోపేత మగును గాక! అందుకొరకే యీ ఆహుతి నర్పించుచున్నాను.

**ఓం విశ్వాని దేవ సవిత ర్దురితాని పరాసువ ।**

**యద్భద్రం తన్న ఆసువ స్వాహా ॥** - యజు. 30-3

**ఓం అగ్నే! నయ సుపథా రాయే అస్మాన్**

**విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।**

**యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో**

**భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ స్వాహా ॥** - యజు. 40-16

(ఈ రెండు మంత్రాల భావార్థం ప్రార్థనా మంత్రాలలో మొదటి, చివరి మంత్రాలలో గలదు)

## గాయత్రీ మంత్రంతో ఆహుతులు

**ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యమ్ ।**

**భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్ స్వాహా**

(ఋ. 3-16-10, యజు. 3-35, 22-9, 30-2, 36-3, సామ 2462, అనేక సంహితా బ్రాహ్మణ ఆరణ్యకములందును గలదు)

హే రక్షక! సచ్చిదానంద స్వరూప! జగదుత్పాదక దేవ! నీ దివ్య గుణయుక్తము,

వరేణ్యము నగు శుద్ధ విజ్ఞాన స్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము గాక! నీవు మాకు సద్బుద్ధి నిచ్చి సత్కర్మల నాచరించునట్లు ప్రేరేపింతువు గాక!

పై గాయత్రీ మంత్రంతో మూడు పర్యాయాలు లేదా అవకాశమునుబట్టి ఎక్కువ పర్యాయాలు ఆహుతు లివ్వవచ్చును.

## పూర్ణాహుతి

ఈ క్రింది ఒక్కొక్క మంత్రంతో ఒక్కొక్క నిండు గరిటెడు నేతిని ఆహుతులుగ నివ్వవలెను.

**ఓం సర్వం వై పూర్ణం స్వాహా (1)**

**ఓం సర్వం వై పూర్ణం స్వాహా (2)**

**ఓం సర్వం వై పూర్ణం స్వాహా (3)**

తదుపరి శ్రువను (నేతి గరిటెను) ప్రక్కకు పెట్టి గిన్నెను కుడిచేత పట్టుకొని మిగిలియున్న నేతిని కూడ అగ్నిహోత్రం నందే వంచి గిన్నెను ఖాళీ చేయవలెను.

హే రక్షక! నీ కృప వలన ఈ అగ్నిహోత్ర కార్యం నిశ్చయంగ పూర్తియైనది.

వ్యాఖ్య : ఇచ్చట మూడు ఆహుతులిచ్చుటకు కారణము ఇవి కార్య సమాప్తిని తెలుపును. ఈ ఆహుతులు ఈశ్వర రచితమైన త్రిలోకములు – భూ అంతరిక్ష ద్యులోకములు పూర్ణములనియు, అందు ఏ కొరతయు లేదనియు తెలుపును. అట్లే, ఈ అగ్నిహోత్రం కూడా త్రిలోకములను పూర్ణం చేయును. పరమేశ్వరుడు పూర్ణుడు. పరమేశ్వరుని సృష్టి పూర్ణం. పరమేశ్వర జ్ఞానమును (వేదమును) పూర్ణమే.

## ప్రార్థన

అనంతరం నేతిగిన్నెలో కొన్ని చుక్కలు నీరుపోసి గిన్నెకు అంటిన నేతిని, నీటిని కలిపి రెండు అరచేతులకు రాచుకొనవలెను. ఆ అరచేతులను యజ్ఞాగ్నికి కొద్దిగా కాచుకొని (వేడి చేసుకొని) వాసన చూచుచు ఈ క్రింది మంత్రాలను భావసహితంగా నుచ్చరించుచు ప్రార్థన చేయవలెను. ఒక్కొక్క మంత్రంతో నొక్కొక్క పర్యాయం కాచుకొని వాసన చూడవలెను.

**ఓం తేజోఽసి తేజో మయి ధేహి**

హే సర్వ సంరక్షక! సర్వేశ్వర! నీవు తేజ స్వరూపుడవు. దయతో నా యందును

తేజస్సును నింపుము.

**ఓం వీర్య మసి వీర్యం మయి ధేహి**

హే రక్షక! నీవు అనంత పరాక్రమ యుక్తుడవు. నీ కృపా కటాక్షముచే నా యందును పూర్ణ పరాక్రమము నుంచుము.

**ఓం బల మసి బలం మయి ధేహి**

ఓ దేవ! నీవు అనంత బలయుక్తుడవు. నీ అనుగ్రహంతో నాకును పూర్ణ బలమును ప్రసాదించుము.

**ఓం ఓజో౽సి ఓజో మయి ధేహి**

హే జగద్రక్షక! నీవు అనంత సామర్థ్య యుక్తుడవు. నాకును పూర్ణ సామర్థ్యమును ప్రసాదింపుము.

**ఓం మన్యు రసి మన్యుం మయి ధేహి**

ఓ న్యాయకారి! నీవు దుష్టుల యందును, దుష్ట కార్యములందును క్రోధకారివి. దయచేసి నన్నును అట్లే కావింపుము.

**ఓం సహో౽సి సహో మయి ధేహి** - యజు. 19-9

హే సహనశీల పరమేశ్వర! నీవు నిందాస్తుతుల యందును, నీ కపరాధము చేయువారి యెడలను సహనం కలవాడవు. నీ కృపచే నేనును అట్లే యగుదును గాక!

**వ్యాఖ్య :** ఈ క్రియ యందలి వైజ్ఞానిక ప్రయోజనమేమన - యజ్ఞాగ్ని నుండి వెడలు వాయువులు స్రువకు (నేతి గరిటెకు) ఎక్కువగ తాకుచుండును. ఆ గరిటె మరల మరల నేతిగిన్నెలో ముంచుట జరుగుచుండును. అందుచే క్రమంగా గిన్నెలో నున్న నేయి ఔషధీయుక్త మగుచుండును. చివరగా మిగిలియున్న ఆ కొద్ది నెయ్యియే శక్తివంతమైన ఔషధమగును. దానిని చేతులకు రాచుకొని మరల యజ్ఞాగ్నికి కాచుకొని వాసన చూచుట వలన ప్రయత్న పూర్వకంగా యజ్ఞవాయువును ఎక్కువగా స్వీకరించినవారమగుదుము. ఆ శేషఘృతమునే యజ్ఞశేష మనియు యజ్ఞ ప్రసాదమనియు అందురు. దీనిని వాసన చూచుటయేగాక ముఖమునకు, శరీరమునకు రాచుకొనవచ్చును. లోపలికి సేవింపవచ్చును.

## సత్సంగము

అనంతరం అవకాశమునుబట్టి కొంత సమయం స్వాధ్యాయం చేయుట

మంచిది. స్వాధ్యాయమునందు పరమేశ్వర వాణియైన వేదాలను గాని, ఋషి మునుల ఉపనిషత్ మనుస్మృత్యాది గ్రంథాలను గాని పఠించవలెను. అంత యోగ్యత లేనివారు పైగ్రంథముల సారాంశమైన సత్యార్థ ప్రకాశము, ఋగ్వేదాది భాష్య భూమిక, ఋగ్ యజుర్వేద భాష్యములు, ఆర్యాభివినయము మొదలగు మహర్షి దయానందుని గ్రంథములు చదువుకొనుట ఉపయుక్తముగా నుండును. ఇంకను సమయం మిగిలియున్న కొన్ని భజనలు పాడుకొనవచ్చును. విశ్వశాంతిని గోరు శ్లోకములు, మంత్రములు పఠింపవచ్చును.

ప్రాచీన వైదిక సాంప్రదాయము ననుసరించి అగ్నిహోత్రంతోబాటు రెండు సంధ్యాసమయములందును సంధ్యావందనం చేయవలెను. ఉదయం అగ్నిహోత్రానికి ముందుగాను, సాయంత్రం అగ్నిహోత్రం తదుపరి సంధ్య చేయుటకు అనుకూల సమయాలు. సంధ్యావందనంలోని వైజ్ఞానిక భావాలను మరొక గ్రంథంలో "సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచనం"లో వివరింపబడినవి.

## శాంతి పాఠం

చివరగా ఈ క్రింది యజుర్వేద శాంతిమంత్ర పఠనంతో సత్సంగం ముగించవలెను.

**ఓం ద్యౌః శాంతి రంతరిక్షం శాంతిః పృథివీ శాంతి**
**రాపః శాంతి రోషధయః శాంతిః, వనస్పతయః శాంతి**
**ర్విశ్వే దేవాః శాంతి ర్బ్రహ్మశాంతిః, సర్వం శాంతిః**
**శాంతిరేవ శాంతిః, సా మా శాంతి రేధి ॥** - యజు. 36-17

హే సర్వ సంరక్షక! సర్వాంతర్యామిన్ దేవా! నీ కృపవలన ద్యు అంతరిక్ష పృథివీ లోకములు మాకు శాంతిదాయకములగును గాక! జల ఔషధీ వనస్పతులు, సమస్త విద్వాంసులు, వేదం, సంపూర్ణ ప్రపంచం మాకు శాంతి నిచ్చునదియే అగును గాక! హే సర్వేశ్వర! నీ శాసనం వలన ఈ బ్రహ్మాండమునందంతట శాంతియే నెలకొని యున్నది. నీ కృప వలన ఆ శాంతి నా యందును చేరి వర్ధిల్లును గాక!

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

హే రక్షక! నీ కృపా కటాక్షముచే మా ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆధిదైవిక దుఃఖములన్నియు శాంతించును గాక!

# బృహద్ యజ్ఞ విశేష ఆహుతులు

## స్విష్టకృదాహుతి (ప్రాయశ్చిత్తాహుతి)

**ఓం యదస్య కర్మణోఽత్యరీరిచమ్ యద్వాన్యూనమిహాకరం,**
**అగ్నిష్టత్స్విష్టకృద్విద్యాత్సర్వం స్విష్టం సుహుతం కరోతు మే**
**అగ్నయేస్విష్టకృతే సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తా హుతీనాం**
**కామానాం సమర్ధయిత్రే, సర్వాన్నః కామాన్త్సమర్ధయ.**

– శతపథ బ్రాహ్మణం 14.8.7.5

**భావము:** హే అగ్నీ! ప్రకాశ స్వరూప పరమాత్మా! మేము చేయుచున్న ఈ యజ్ఞ కర్మలో అజ్ఞానం వల్లకానీ, అభావం వల్ల కానీ ఏవైనా ఎక్కువ తక్కువలు, పొరబాట్లు, తడబాట్లు జరిగినచో వాటిని మన్నించుము. వాటివల్ల ఏ ప్రాణికీ కష్ట నష్టములు కలుగకుండునట్లు చేయుము. హే పరమేశ్వరా! నీవు స్విష్టకృతుడవు. యజ్ఞకర్మలను సరిచేయువాడవు. యజ్ఞఫలముల నిచ్చు దేవదేవుడవు. నా తప్పులకు ప్రాయశ్చిత్తంగా ఈ విశేష ఆహుతిని నీకర్పించుచున్నాను. నీ వీ ఆహుతిని సుహుతము చేసి (బాగుగా దహింపచేసి) మా ఈ యజ్ఞకర్మను సరిచేయుము. అట్లే, మాలోని దురాలోచనలను దూరం చేసి సద్విచారాలను నింపుము. మా సమస్త కోరికలను సిద్ధింప చేయుము. స్వాహా = మా వాక్కులు సత్యమగును గాక!

(స్విష్టకృదాహుతిగా – పుష్కలమైన నేతితో కూడిన శుద్ధమైన తీపి పదార్థాన్ని ఆహుతిగా యివ్వాలి. అనంతరం మౌనంగా (మనస్సులోనే చెప్పుకుంటూ) ఈ క్రింది ప్రజాపత్యాహుతి నివ్వాలి.)

**ఓం ప్రజాపతయే స్వాహా – ఇదం ప్రజాపతయే – ఇదం నమమ**

– పారశ్కర గృహ్యసూత్రం 1.11.3

**భావము:** ఓ ప్రజాపతీ! బ్రహ్మాండాధిపతీ! ఈ విశేషాహుతిని స్వీకరించి నన్నునుగ్రహింపుము.

### ప్రధాన హోమ మంత్రాలు

**ఓం భూర్భువః స్వః, అగ్న ఆయూంషి**
**పవస ఆ సువోర్జమిషం చ నః ।**

**ఆరే బాధస్వ దుచ్ఛునామ్ స్వాహా ।**

**ఇదమగ్నయే పవమానాయ ఇదం న మమ.** – ఋ. 9.66.19

**భావము:** ఓం నామక సర్వవ్యాపక సర్వేశ్వరుడు, సచ్చిదానంద స్వరూపుడు, ప్రాణదాత, దుఃఖ నాశకుడు, సుఖదాత అయిన, ఓ అగ్నినామక పరమేశ్వరా! నీవు మా ఆయువును పవిత్రపరచి రక్షించుము. మాకు తగిన అన్నాదులను బలాన్ని ప్రసాదింపుము. మాలోని దుష్టులను దురాలోచనలను, రోగాలను పోగొట్టి మమ్ము కాపాడుము. స్వాహా = అందుకొరకే ఈ ఆహుతి నర్పించుచున్నాను. ఈ ఆహుతి పవమాన అగ్నికొరకే నా కొఱకు కాదు. ఇది నాది కాదు.

**ఓం భూర్భువః స్వః అగ్నిః ఋషిం**
**పవమానః పాఞ్చజన్యః పురోహితః ।**
**తమీమహే మహాగయమ్ స్వాహా**
**ఇదమగ్నయే పవమానాయ ఇదం న మమ.** – ఋ. 9.66.20

**భావము:** హే సచ్చిదానంద స్వరూపా! సర్వేశ్వరా! నీవు ఋషివి – సర్వద్రష్టవు. పవమానుడవు – పవిత్రం– చేయువాడము. పాంచజన్యుడవు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు మరియు నాస్తికులకు కూడా మేలు చేయువాడవు. పురోహితుడవు – మేము కోరకముందే మాకు హితము చేయువాడవు. అట్టి మహా యశస్వియైన నిన్నే స్తుతింతుముగాక! ప్రార్థింతుము గాక! ఉపాసింతుము గాక!

**ఓం భూర్భువః స్వః అగ్నే పవస్వ స్వపా అస్మే వర్చః సువీర్యమ్ ।**
**దధద్రయిం మయిం పోషమ్ స్వాహా**
**ఇదమగ్నయే పవమానాయ ఇదం న మమ.** – ఋ. 9.66.21

**భావము:** ఓ ప్రాణ స్వరూపా! దుఃఖనాశక! సుఖ ప్రదాతా! నీవు సత్కర్మలు చేయువారిని పవిత్రం చేయువాడవు. అట్టి నీవు నాకు తేజస్సును, వర్ఛస్సును, పరాక్రమాన్ని ప్రసాదించు. నా యందు జ్ఞాన ధనమును, పుష్టిని, తుష్టిని నింపుము. స్వాహా = అందుకొరకే ఈ ఆహుతి నర్పించుచున్నాను.

**ఓం భూర్భువః స్వః, ప్రజాపతే న త్వదేతాన్యన్యో**
**విశ్వా జాతాని పరి తా బభూవ ।**
**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు**

**వయం స్యామ పతయో రయీణామ్ స్వాహా**
**ఇదం ప్రజాపతయే ఇదం న మమ.** – ఋ. 10.121.10

**భావము:** హే సర్వ సంరక్షక! సచ్చిదానంద స్వరూపా! ప్రజాపతీ! ఈ సృష్టిలోని సమస్త ఉత్పన్న పదార్థాలను తెలిసినవాడు నీకన్న మరొకడు లేడు. అన్నిటిని సృజించినవాడవు నీవే కదా! ఇంతేగాక! అన్నిటినీ ఆవరించి అన్నిటిలోను వ్యాపించి ధరించి ఉన్నవాడవు కూడా నీవే. మేము ఏ ఏ కోరికలతో పూర్ణ పురుషార్థం చేస్తూ నీ అనుగ్రహానికై అర్థిస్తున్నామో వాటన్నిటిని మాకు ప్రసాదింపుము. నీ కృప వలన మేమీ లోకమున వివిధ ధనములకు స్వాముల మగుదుముగాక! స్వాహా = నేనీ భావనతోనే ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

## అష్టాజ్యాహుతి మంత్రాలు

**ఓం త్వం నో అగ్నే వరుణస్య విద్వాన్**
**దేవస్య హేళోऽవ యాసిసీష్ఠాః ।**
**యజిష్ఠో వహ్నితమః శోశుచానో**
**విశ్వా ద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా**
**ఇదమగ్నీ వరుణాభ్యాం - ఇదం న మమ.** – ఋ. 4.1.4

**భావము:** హే అగ్నే! ప్రకాశ స్వరూప పరమేశ్వరా! మాలో ఎవరు శ్రేష్ఠ విద్వాంసుడో అతనిని నీవెరుగుదువు. అట్టి శ్రేష్ఠ విద్వాంసుని క్రోధమునకు నేను గురికాకుండునట్లు అనుగ్రహింపుము. నా లోపాలను నేను సవరించుకుంటూ, వారికి ప్రియుడనగునట్లు చేయుము. తద్వారా నేను సదా యజ్ఞాది శుభకర్మలు చేస్తూ ఎంతటి కార్యభారాన్నైనా వహించగలవాడను! తేజోవంతుడను అగుదును గాక! స్వాహా = అందుకొరకే ఈ ఆహుతి నిచ్చుచున్నాను.

ఇదమగ్నీ వరుణాభ్యాం – ఇదం న మమ. ఈ ఆహుతి అగ్ని వరుణుల కొరకే అర్పించుచున్నాను. నా కొరకు కాదు.

**ఓం స త్వం నో అగ్నేऽవమో భవోతీ**
**నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ ।**
**అవ యక్ష్వ నో వరుణం రరాణో**
**వీహి మృళీకం సుహవో న ఏధి స్వాహా**
**ఇదమగ్నీ వరుణాభ్యాం - ఇదం న మమ.** – ఋ. 4.1.5

**భావము:** ఓ అగ్నీ! ప్రకాశ స్వరూప పరమాత్మా! నీవు మాకు రక్షకుడవు, సమీపస్థుడవు కమ్ము. ఈ ఉషఃకాలంలో మమ్ము ఆవరించుచున్న దుఃఖాలను నాశనం చేసి మాకు సుఖాలను ప్రసాదింపుము. మాకు సులభ లభ్యుడవు కమ్ము. అందుకొరకే ఈ ఆహుతి నర్పించుచున్నాను.

**ఓం ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృళయ ।**
**త్వామవస్యురా చకే స్వాహా**
**ఇదం వరుణాయ ఇదం న మమ.** – ఋ. 1.25.19

**భావము:** హే వరుణ! సర్వాన్ని ఆవరించి వున్న దేవా! ఈ సంసార బంధనంలో చిక్కుకొని పెక్కు దుఃఖాల ననుభవిస్తూ ఆర్తనాదాలు చేయుచున్న నా పిలుపును వినుము. వెంటనే నా దుఃఖాలను దూరం చేసి సుఖింపచేయుము. ఇకనుండి నేను సదా శుభకర్మలనే ఆచరిస్తూ నిన్ను ప్రసన్నుని చేసుకొందును గాక! అందుకొరకే ఈ ఆహుతి నర్పించుచున్నాను.

**ఓం తత్వాయామి బ్రహ్మణా వందమాన**
**స్తదా శాస్తే యజామానో హవిర్భిః ।**
**అహేళమానో వరుణేహ బోధ్యురుశంస**
**మాన ఆయుః ప్రమోషీః స్వాహా.**
**ఇదం వరుణాయ - ఇదం న మమ.** – ఋ. 1.24.11

**భావము:** హే సర్వవ్యాపక ప్రభో! వేదమంత్రాలతో నిన్ను స్తుతిస్తూ నీ శరణు జొచ్చుచున్నాను. వేదవిహిత శుభకర్మల నాచరిస్తూ నిన్ను ప్రార్థించుచున్నాను. నా ప్రార్థనల నాలకించి నన్ను కాపాడుము. అకాలమృత్యువును దూరం చేసి దీర్ఘ జీవనాన్ని ప్రసాదించు. అందుకొరకే ఈ ఆహుతి నర్పించుచున్నాను.

**ఓం యేతే శతం వరుణ యే సహస్రమ్,**
**యజ్ఞియాః పాశా వితతా మహాన్తః**
**తేభి ర్నోద్య సవితోత విష్ణుర్విశ్వే**
**ముంచంతు మరుతః స్వర్కాః స్వాహా**
**ఇదం వరుణాయ సవిత్రే విష్ణవే విశ్వేభ్యో**
**దేవేభ్యో మరుద్భ్యః సర్కేభ్యః ఇదం న మమ.**

– కాత్యాయన శ్రౌత సూత్రాలు 25.1.11

**భావము:** హే వరుణ! సర్వశ్రేష్ఠ ప్రభో! ఈ లోకంలో వందల కొలది, వేలకొలది యజ్ఞీయ పాశాలున్నాయి. ఎన్నెన్నో సృష్టినియమాలున్నాయి. వేదాల ద్వారా ఆ సృష్టి నియమాల గురించి, తెలుసుకొని పూర్ణ పురుషార్థం (ప్రయత్నం) చేయవలసి ఉంది. ఓ సవితా దేవా! ప్రేరక పరమేశ్వరా! అట్టి జ్ఞానాన్ని, శక్తి యుక్తులను మాకు ప్రసాదించు. ఈ విషయంలో పూజ్యులగు వేద విద్వాంసులు కూడా మాకు జ్ఞానబోధ చేస్తూ మమ్ము సన్మార్గాన నడిపింతురు గాక!

అందుకొరకే నేనీ ఆహుతి నర్పించుచున్నాను. ఓ దేవా! నీవు వరుణుడవు. (సర్వశ్రేష్ఠ ప్రభువువు) సవితవు (సృష్టికర్తవు.) విష్ణువువు (సర్వవ్యాపక సర్వ సంరక్షకుడవు). అట్టి నీకును మరియు ఈ లోకములో నున్న పూజ్యులగు విద్వాంసుల సంక్షేమం కొరకు ఈ ఆహుతి నర్పించుచున్నాము.

**ఓం అయాశ్చాగ్నే అస్య నభిశస్తి పాశ్చ సత్యమిత్య మయాసీ,**
**అయానో యజ్ఞం వహాస్యయా నో ధేహి భేషజగ్ం స్వాహా,**
**ఇదమగ్నయే అయసే ఇదం న మమ.**

– కాత్యాయన శ్రౌత సూ. 15. 1. 11

**భావము:** ఓ అగ్నీ! నీవు (అయాః) సర్వవ్యాపకుడవై యున్నావు. నా ఇంద్రియ మనోబుద్ధులలోను, జీవాత్మనైన నాలో కూడా వ్యాపించి యున్నావు. కాన, నాలోని కామ క్రోధాది శత్రువుల నుండి నన్ను కాపాడుము. సత్యంగా నీవే అంతటా వ్యాపించగల సూక్ష్మతముడవు. మేము చేయుచున్న ఈ యజ్ఞంలోనూ వ్యాపించి యున్నావు. కనుక, ఈ యజ్ఞాన్ని పవిత్రం చేయుము. సఫలం చేయుము. యజ్ఞం ద్వారా మాకు శారీరకారోగ్యాన్నేకాక మానసికారోగ్యాన్ని కూడా ప్రసాదించు. ఈ యజ్ఞ వాయువు విశ్వభేషజ మగునట్లు–సర్వరోగ నివారిణి అగునట్లు ఆశీర్వదించు.

**ఓం ఉదుత్తమం వరుణ పాశమస్మ**
**దవాధమం వి మధ్యమం శ్రథాయ ।**
**అథా వయమాదిత్య వ్రతే తవానాగసో ।**
**అదితయే స్యామ స్వాహా.**
**ఇదం వరుణాయా2దిత్యామాదితయేచ - ఇదం న మమ.**

– ఋ. 1. 24. 15

**భావము:** ఓ వరుణ! వరణీయ ప్రభో! నీవు మా ఉత్తమ, మధ్యమ, సాధారణ

వర్గానికి చెందిన భవబంధనాలన్నిటిని శిథిలం చేయుము. వదులుచేసి విడిపించుము. మేము సంసారబంధనాలన్నిటినుండి విడివడి నీ వ్రతములను చేయగలుగునట్లు అనుగ్రహింపుము. మేము వేదమార్గంలో నడుస్తూ, ప్రకృతి నియమాల ననుసరిస్తూ పాపరహితులమై నిన్ను చేరుదుముగాక! అదితయే స్యామ – అఖండానందాన్ని పొందుటకు అర్హులమగుదుము గాక!

**ఓం భవతన్నః సమనసౌ సచేతసావరేపసౌ,**<br>
**మా యజ్ఞం హిగ్ంసిష్టం మాయజ్ఞపతిం**<br>
**జాతవేదసౌ శివౌభవతమద్య నః స్వాహా**<br>
**ఇదం జాతవేదోభ్యాం – ఇదం న మమ.** – యజు. 5.3

**భావము:** హే సర్వవ్యాపక సర్వేశ్వరా! నీ కృపవలన మాలో పాపరహితులు, జ్ఞానులు పరస్పరం సహాయం చేసుకొను స్త్రీ పురుషులు అనేకులు జన్మింతురుగాక. వారంతా వేదవిదులై యజ్ఞమును, యజ్ఞపతిని హింసింపకుందురుగాక. మా ఈ యజ్ఞంలో సహాయకులగుదురు గాక.



# పుత్రుల సంక్షేమం కొరకు పౌర్ణమాస్యేష్టి

పరమేశ్వరుని అత్యద్భుతమైన ఈ సృష్టిలో పౌర్ణమి ఒక విశిష్ట దినం. ఆ రోజు రాత్రి ఆకాశంలో చంద్రుడు పూర్ణంగా కనబడతాడు. తన ఆహ్లాదకరమైన వెన్నెలతో మనను పరవశింపచేస్తాడు. మనలనేకాక సృష్టిలోని స్థావర జంగమ ప్రాణులనన్నిటిని ప్రభావితం చేస్తాడు. ముఖ్యంగా చంద్రుని ప్రభావం సముద్రంపై స్పష్టంగా కనబడుతుంది. వెన్నెల ఎంత ఎక్కువగా ఉంటే అంత ఎక్కువగా అలలు పైపైకి లేస్తూ ఉంటాయి. సూర్యకిరణాలపై పరిశోధన చేసినట్లే కొందరు ఔత్సాహిక విజ్ఞానవేత్తలు చంద్రకిరణాలపై కూడా పరిశోధనలు చేశారు. కొన్ని ఆసక్తికరమైన విషయాలను వెలుగులోనికి తెచ్చారు. చంద్రకిరణాల ప్రభావం పంటలపై విశేషంగా ఉంటుందట. ముఖ్యంగా కాయ, పప్పుధాన్యాలు పాలు పోసుకునే సమయంలో (గింజలు ఏర్పడే సమయంలో) వెన్నెల ప్రకాశవంతంగా ఉంటే ఆ సంవత్సరం పంట దిగుబడి ఎక్కువగా ఉన్నట్లు గుర్తించారు. **“పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః ”** – రసాత్మకుడైన సోముడు (చంద్రుడు) సర్వ ఓషధులను పుష్టివంతం చేస్తాడు.” అని కదా! గీతావచనం (15–13). వేడి, మంటలు మొదలైన బాధలతో ఉన్న రోగులు వెన్నెలలో ఉంటే వారి బాధలు కొంత ఉపశమించినవట. తెల్లటి పారదర్శక సీసాలలో నీరుపోసి రాత్రంతా వెన్నెలలో ఉంచి ఆ నీటిని సేవిస్తే వేడితత్త్వ రోగులకు కొంత ఉపశమనం కలిగిందట. మానసిక రోగులపై చంద్రకిరణాలు ప్రభావం చూపుతున్నాయట. ఇట్టివే మరికొన్ని విషయాలు చెబుతున్నారు.

పౌర్ణమి చంద్రుని దర్శనం భగవద్భక్తులకు మరింత ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. సృష్టికర్త మహిమను మరింత ప్రకటింపచేసి వారి భక్తిని మరింత పెంచుతుంది. కన్యాకుమారి వంటి మూడువైపుల సముద్రం కల ప్రదేశాలలో ఈ దర్శనం చాలా మనోహరంగా ఉంటుంది. ఆ రోజు పడమటివైపు సూర్యుడు అస్తమిస్తూ ఉంటే తూర్పున చంద్రుడు ఉదయిస్తూ ఉంటాడు. ఆ రాత్రంతా పూర్ణచంద్రుని దర్శనం చేసుకోవచ్చును. మరునాడు ఉదయం సూర్యుడు ఉదయిస్తూ ఉండగా చంద్రుడు అస్తమిస్తూ ఉంటాడు. రెంటినీ ఒకేసారి చూడవచ్చు. ఇట్టి విశిష్టతలు కలిగి ఉండబట్టే మన ఋషులు చంద్రున్ని ఒక దేవతగా – వసుదేవతగా లెక్కించారు.

వసుదేవతలంటే ప్రాణులను వసింపజేసేవి. అవి 8. పంచభూతాలు + సూర్య, చంద్ర, నక్షత్రాలు. వీటి ఆధారంతోనే ప్రాణులు జీవిస్తున్నాయి. అట్టి వసుదేవతలలో ఒకటయిన చంద్రునికి పౌర్ణమిరోజున దైనిక అగ్నిహోత్రంలో 3 విశేష ఆహుతులివ్వాలని ఋషుల నిర్దేశం. అవి –

1) **ఓం అగ్నయే స్వాహా –** అగ్ని దేవతకు ఈ ఆహుతిని ఇచ్చుచున్నాను.

2) **ఓం అగ్నిసోమాభ్యాం స్వాహా –** అగ్ని మరియు సోములకు ఈ ఆహుతిని ఇచ్చుచున్నాను.

3) **ఓం విష్ణవే స్వాహా –** వ్యాపక గుణముగల అగ్నిసోములకు ఈ ఆహుతిని ఇచ్చుచున్నాను.

**వివరణ :** అగ్నితత్వం ఎప్పుడూ సృష్టిలో వ్యాపించి ఉంటుంది. భూలోకంలో సామాన్య అగ్నిగాను, భువర్లోకంలో (వాయువు సంచరించే అంతరిక్షంలో) జాతవేదాగ్నిగాను, స్వర్లోకంలో (సూర్యాది గోళాలు ఉన్నచోట) అంగిరాగ్నిగాను ఉంటుందని ఋషులంటారు. ఈ మూడు అగ్నులను అగ్నిహోత్రం బలపరుస్తుంది. అందుకనే అగ్న్యాధానం చేసిన అనంతరం 3 విశేష సమిధలను మంత్రపూర్వకంగా హోమకుండంలో ఉంచుతారు. పై మూడు వాక్యాలలోని మొదటి వాక్యంతో అట్టి అగ్నికి ఆహుతి ఇవ్వబడింది. రెండవ వాక్యంలో అగ్నితత్త్వంతోబాటు పౌర్ణమి రోజున సోమతత్త్వం విశేషంగా ఉంటుంది. (సోముడు అంటే సౌమ్యంగా – చల్లగా హాయిగొల్పేవాడని అర్థం. ఇట్టి సౌమ్యగుణం ఎక్కువగా ఉండటంవల్ల చంద్రుని సోముడంటాయి మన శాస్త్రాలు.) అట్టి అగ్నిసోములకు రెండవ ఆహుతి ఇవ్వబడుతుంది. ఈ రెండు తత్త్వాలు ఒకేచోట స్థిరంగా ఉండక వ్యాపించే గుణం కలిగి ఉంటాయి కనుక మూడవ వాక్యంతో 'ఓం విష్ణవే స్వాహా' అంటూ ఆహుతినిస్తారు. ఈ మూడు ఆహుతులను నేతితోబాటు ఒక తీపి పదార్థాన్ని కూడా కలిపి ఆహుతిగా ఇవ్వాలని గృహ్యాసూత్రాలు చెబుతాయి. అనంతరం –

1) **ఓం భూరగ్నయే స్వాహా – ఇదమగ్నయే – ఇదన్నమమ.**

2) **ఓం భువర్వాయవే స్వాహా – ఇదం వాయవే – ఇదన్నమమ.**

3) **ఓం స్వరాదిత్యాయ స్వాహా – ఇదమాదిత్యాయ – ఇదన్నమమ.**

4) **ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా – ఇదమగ్ని వాయ్వాది**

**తేభ్యః ఇదన్నమమ.**

అంటూ 4 ఆహుతులనిచ్చి యజ్ఞాన్ని పూర్తి చెయ్యాలి. ఈ వాక్యాల భావమేమంటే అగ్నిహోత్రంలో వేసిన ఆహుతులు భూలోకంలో అగ్నిగాను, భువర్లోకంలో (అంతరిక్షంలో) వాయువుగాను, స్వర్లోకంలో ఆదిత్యునిగాను మార్పు చెందుతాయని చెప్పటం.

ముఖ్యంగా గృహస్థులు ఈ పౌర్ణమాస్యేష్టిని పుత్రుల సంక్షేమాన్ని కోరుతూ చేస్తారు. ఏవిధంగా శుక్లపక్ష చంద్రుడు దినదినం ప్రవర్ధమానం అవుతూ పౌర్ణమినాటికి పూర్ణత్వాన్ని పొందుతాడో, అట్లే నా పుత్రులు దినదినాభివృద్ధి చెందుతూ శారీరకంగా, బౌద్ధికంగా, ఆత్మికంగా పూర్ణత్వాన్ని పొందాలని కోరుకుంటారు. తమ కుటుంబ కీర్తిని, వంశకీర్తిని మరింత ఇనుమడింపచేయాలని ఆశిస్తారు. ఇచ్చట పుత్రులంటే కేవలం మగ సంతానమే కాదు, పుత్రికలు కూడా. యజుర్వేదంలోని కర్మకాండను వివరించే శతపథ బ్రాహ్మణం పౌర్ణమాసేష్టి యజ్ఞ వివరణతోనే ప్రారంభమౌతుంది. అక్కడ ఆ కర్మకాండ చాలా విశాలంగా ఉంటుంది. దాని సంక్షిప్త రూపమే ఈ పక్షయజ్ఞం. ఇక మనం పౌర్ణమాసీ దేవుణ్ణి గురించి ఆలోచిద్దాము.

వేదాలలో దేవునికి 100కు పైగా పేర్లు కనబడతాయి. ఒక్కొక్క పేరు అతని ఒక్కొక్క గుణాన్ని సూచిస్తాయి. వాటిలో 'పౌర్ణమాసీ' అనేది ఒకటి. ఈ విశాల విశ్వంలో అంతటా అన్నిటా పూర్ణంగా నిండి ఉంటాడు. (పూర్ణమ్ + ఆసీత్) కనుక దేవునికి 'పౌర్ణమాసీ' అనే పేరు ఏర్పడింది. చంద్రుడు తన పరిధిలో తాను పూర్ణంగా ఉన్నరోజు కనుక పౌర్ణమి అని మనం వ్యవహరిస్తున్నాము. అందుచే భౌతిక చంద్రదేవతకు ఇచ్చే ఆహుతులతోబాటు సృష్టి అంతా పూర్ణంగా ఉండే 'పౌర్ణమాసీ' దేవునకు కూడా ఆహుతులిస్తే బాగుంటుంది. దేవుని మహిమను, పూర్ణత్వాన్ని గుర్తించినవారము, స్మరించినవారము అవుతాము. అథర్వవేదం సప్తమకాండలోని 81వ పౌర్ణమాసీ సూక్తంతో ఆహుతులిస్తే సందర్భోచితంగా ఉంటుంది.

ఈ క్రింది పౌర్ణమాసీ సూక్తం చాలా చిన్నది. నాలుగే మంత్రాలున్నాయి. కాని, వాటిలో గంభీరమైన అర్థం ఉంది. పరిశీలించండి. ఈ మంత్రాల చివర 'స్వాహా' కారం పలుకుతూ ఆహుతి నర్పించాలి. అనంతరం 'ఇదం పౌర్ణమాస్యై

– ఇదం న మమ’ అనే వాక్యాలు పలకాలి. అహంకార, మమకారాల నివృత్తి కొరకు ఈవిధంగా పలకటం యాజ్ఞిక ఆచారం.

**ఓం పూర్ణా పశ్చాదుత పూర్ణా పురస్తా దున్మధ్యతః పౌర్ణమాసీ జిగాయ ।**
**తస్యాం దేవైః సం వసన్తో మహిత్వా నాకస్య పృష్ఠే సమిషా మదేమ స్వాహా.**
**ఇదం పూర్ణమాస్యై – ఇదం న మమ. – (1)**

**భావార్థం :** పౌర్ణమాసీ దేవుడు మనకు వెనుక, ముందు మరియు మధ్యలో కూడా వ్యాపించి పూర్ణుడై యున్నాడు. సమస్త చరాచర జగత్తునకు ఆధారభూతుడైన పౌర్ణమాసీ దేవుడు వీటన్నిటికన్న గొప్పగా శ్రేష్ఠంగా ప్రకాశిస్తూ ఉన్నాడు. ఆ పరమాత్మయందే సమస్త మహిమాన్విత ప్రాకృతిక దేవతలన్నీ చక్కగా నివసిస్తున్నాయి. అట్టి దేవదేవుని యోగాభ్యాసంతో సాక్షాత్కరించుకొని నాకము యొక్క పృష్ఠముపై – సుఖము యొక్క అత్యంత ఉన్నత స్థానమున ఆనందమును పొందుతూ ఆసీనులమగుదుము రండు.

**ఓం వృషభం వాజినం వయం పౌర్ణమాసం యజామహే ।**
**స నో దదాత్వక్షితాం రయిమనుపదస్వతీమ్ స్వాహా.**
**ఇదం పూర్ణమాస్యై – ఇదం న మమ.** – (2)

**భావార్థం :** మేము సుఖములను వర్షించువాడును, అనంత బలవంతుడును అయిన సర్వశ్రేష్ఠ పౌర్ణమాసీ దేవుని పూజింతుము గాక! అతడు మాకు తరిగిపోని అక్షిత సంపదల నిచ్చును గాక!

**ఓం ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా రూపాణి పరిభూర్జజాన ।**
**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణాం స్వాహా.**
**ఇదం పూర్ణమాస్యై – ఇదం న మమ.**

**భావార్థం :** హే ప్రజాపతివైన పరమేశ్వరా! నీవు తప్ప మరెవ్వరును ఈ సంపూర్ణ ఆకారవంతమైన పదార్థాలను సృష్టించలేరు. వాటియందు వ్యాపించి అసలే ఉండలేరు. కనుక, మేము ఏఏ వస్తువులను కోరుతూ ఆహుతులిస్తున్నామో (పూర్ణ ప్రయత్నం చేస్తున్నామో) వాటన్నిటిని మాకు ప్రసాదింపుము. మేము సంపదలకు స్వాములమగుదుము గాక!

**ఓం పౌర్ణమాసీ ప్రథమా యజ్ఞియాసీత్ అహ్నాం రాత్రీణామతిశర్వరేషు ।**
**యే త్వాం యజ్ఞైర్యజ్ఞియే అర్ధయన్త్యమీ తే నాకే సుకృతః ప్రవిష్టాః**
**స్వాహా. ఇదం పూర్ణమాస్యై - ఇదం న మమ.**

- అథర్వవేదం 7-80-1 నుండి 4

**భావార్థం :** మేము సదా ముందుగా పౌర్ణమాసీ దేవునే పూజింతుముగాక! స్తుతి ప్రార్థనోపాసనలను చేతుముగాక! పగలు, రాత్రి, కటిక చీకటిలో కూడా అతనినే పూజింతుము గాక! హే పూజనీయ పరమేశ్వరా! ఎవరు నిన్ను యథాయోగ్యంగా (సరియైన విధంగా) పూజిస్తారో, సత్కర్మల నాచరిస్తూ వాటి ఫలాలను నీకర్పిస్తారో అట్టి సుకృతులంతా నాకమున - ఆనందమయ ముక్తిధామమున ప్రవేశించి చిరకాల మచట ఉంటారు.

ముక్తి యొక్క అవధి 36,000 పర్యాయాలు సృష్టి, స్థితి ప్రళయాలు జరిగినంతకాలం. అంతకాలం ముక్తజీవులు ఆనందాన్ని అనుభవిస్తూ స్వేచ్ఛగా విహరిస్తారు. కనుక మనమంతా అట్టి దేవయాన మార్గమున పయనింతము రండు.

### విశేషాహుతుల మంత్రములు

ప్రతీ పండుగకు బృహద్ యజ్ఞం చెయ్యాలి. అనంతరం పై 4 మంత్రాలతో విశేష ఆహుతులిస్తే సరిపోతుంది. ఎక్కువ ఆహుతులివ్వాలనుకునేవారు లక్ష్మీసూక్తంతోను, గాయత్రీ మంత్రంతోను ఆహుతులివ్వవచ్చు.

శుభమస్తు

# పితరుల సంక్షేమం కొరకు అమావాస్యేష్టి

ఏవిధంగా పుత్రుల సంక్షేమం కొరకు పౌర్ణమాస్యేష్టి ఏర్పడిందో, అట్లే పితరుల సంక్షేమం కొరకు అమావాస్యేష్టి ఏర్పడింది. దీనికి దర్శేష్టి అని మరొక పేరు. ఏవిధంగా శుక్లపక్ష చంద్రుని వికాసంవలె పుత్రుల వికాసం ఉంటుందో, అట్లే కృష్ణపక్ష చంద్రుని హ్రాసం (క్షీణత) వలె పితరుల శరీరాలు దుర్బలములౌతాయి. కనుక ఆ సమయంలో పుత్రులు పితరుల సేవా శుశ్రూషలు చేసి పితృఋణం తీర్చుకోవాలి. లేకుంటే కృతఘ్నులౌతారు. పాపభాగులౌతారు. 'పున్నామ నరకం

నుండి కాపాడేవాడే పుత్రు'డంటారు కదా! పున్నామ నరకం అంటే మరణానంతరం వెళ్ళే నరకం కాదు. వృద్ధావస్థనే పున్నామ నరకం అంటారు. ఆ స్థితిలో పితరులను ఆదరించి కాపాడుతూ ఉంటాడు కనుక పుత్రుడంటున్నారు. వయస్సు పెరిగేకొలది శరీరం శుష్కిస్తుంది. బలం ఉత్సాహం తగ్గిపోతూ ఉంటాయి. ఇంద్రియ శక్తులు క్షీణిస్తూ ఉంటాయి. కంటిచూపు, చెవి వినికిడి, నడక, చేతులలో పనితనం తగ్గిపోతూ ఉంటాయి. ఎముకలలో అరుగుదల వచ్చి మోకాళ్ళనొప్పులు, నడుంనొప్పులు, కీళ్ళనొప్పులు, నరాలనొప్పులు మొదలగునవి రావచ్చు. నేడు నవనాగరికత ప్రభావం వల్ల బి.పి., షుగర్, కొలెస్ట్రాల్, రక్తప్రసార లోపాలు, నరాల సమస్యలు చాలానే బాధిస్తున్నాయి. కనుక పుత్రులు వృద్ధుల శరీరాలకు తగిన పథ్యంగా భోజనం సమకూర్చిపెట్టాలి. ఆవిధంగా వృద్ధులకొరకు ప్రత్యేకంగా చేయబడిన ఆహారాన్ని వేదం 'స్వధా' అంటుంది. 'పితృభ్యః స్వధానమః' అనే వాక్యం యజుర్వేదంలో చాలా పర్యాయాలు వస్తుంది. పితరులకు, పితామహులకు, ప్రపితామహులకు (తండ్రి, తాత, ముత్తాతలకు) కూడా సేవా శుశ్రూషలు చేయమంటుంది వేదం. నేడునూ కొందరు మునిమనుమల సేవలను అందుకుంటున్నారు కదా! ఇక్కడ పితరులంటే కేవలం తల్లితండ్రులనే కాదు, అమ్మమ్మలు, నానమ్మలు కూడా.

మన వేదశాస్త్రాలలో 'పితర' పదం విస్తృతమైన అర్థాలతో కనబడుతుంది. ఎందుచేతనంటే – ఈ పదం 'పా – రక్షణే' అనే ధాతువుతో నిర్మించబడుతుంది. కనుక మనను రక్షించేవారు, మన ఉన్నతికి పాటుపడినవారు అంతా మనకు పితరులే. అందుచేతనే ఆచార్య చాణక్యులవారు...

**శ్లో॥ జనితా చ + ఉపనేతా చ యస్తు విద్యాం ప్రయచ్ఛతి ।**
**అన్నదాతా భయత్రాతా పంచైతే పితరః స్మృతాః ॥**

తల్లిదండ్రులు, ఉపనయనం చేసి గురుకులానికి లేదా విద్యాలయాలకు పంపి చదివించినవారు, విద్యలు నేర్పిన గురువులు, ఆకలితో అలమటించకుండా అన్నం పెట్టి కాపాడినవారు, దుష్టులవల్ల భయం కలిగినప్పుడు అభయమిచ్చి కాపాడినవారు – ఈ ఐదు వర్గాలకు చెందినవారంతా పితరులే" నంటారు. ఇది వేదం చెప్పే విషయమే. పై శ్లోకంలో చాణక్యులవారు సరళంగా చెప్పారు. వీరినేకాక విద్యా విజ్ఞాన రంగాలలో కృషిచేసినవారిని, యోగసాధకులను, ధర్మోపదేశకులను, కళాకారులను, దేశంకోసం ధర్మంకోసం పాటుపడేవారినీ కూడా వేదం పితరులే

నంటుంది. వీరందరిని గృహస్థులు ఆదరించి సత్కరించి వారినుండి ఉపదేశాలను, అనుభవాలను పొందమంటుంది. వీరిని శ్రద్ధతో సేవించటమే శ్రాద్ధమనీ, అనుకూలమైన ఆహారాలను ఇచ్చి తృప్తిపరచటమే తర్పణమనీ మన శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ శ్రాద్ధ తర్పణాలు జీవించి ఉన్నవారికే కాని మృతులైనవారికి కాదు. ఆదిమ స్మృతికర్తయైన మనుమహర్షి గారు ఏమన్నారంటే -

**శ్లో॥ కుర్యా దహరహః శ్రాద్ధమ్ అన్నాద్యేన ఉదకేన వా ।**
**పయో మూల ఫలైర్వాఽపి పితృభ్యః ప్రీతిమావహన్ ॥** -
మనుస్మృతి 3-82

"ప్రతిదినము పితరులను ఆహ్వానించి అన్న జలములతోను; పాలు, పండ్లు, శాకములతోను శ్రాద్ధము చెయ్యాలి" అన్నారు. ఇవన్నీ జీవించి ఉన్నపుడు మాత్రమే సాధ్యం. చనిపోయిన తరువాత ఎలా చెయ్యగలం? వారు ఎక్కడ ఉన్నారని వాటిని పంపగలం? ఈ పొరబాటును సరిచేసుకోకపోతే మనం నవ్వులపాలవుతాం. పై వారందరిని ఆహ్వానించి సత్కరిస్తే మనకేం మిగులుతుంది అని అనుకోవద్దు. యథాశక్తి చెయ్యవచ్చు. అటువంటి యోగ్యతగల పితరులు చాలా కొద్దిమందే ఉంటారు. వారు కూడా అందరు పెట్టినది తినలేరు కదా! "Give Respect to Senior Citizens - Don't ignore their experiences" అనే నినాదాన్ని పాటించినా చాలు. ఆ ఉద్దేశ్యంతోనే ఋషులు అమావాస్యేష్టి సదాచారాన్ని ఏర్పాటు చేశారు. ఇక మనం అమావాస్యను గురించి ఆలోచిద్దాము.

అమావాస్యనాడు చంద్రుడు మనకు అసలు కనబడడు. అట్లని చంద్రుడు మాయం కాడు. ఆరోజు అతడు సూర్యునికి తోడుగా నడుస్తూ ఉంటాడు. పగలే సూర్యునితో ఉదయిస్తాడు, సూర్యునితో అస్తమిస్తాడు. సూర్యుని తీవ్ర ప్రకాశం ముందు అతడు కనబడటంలేదు అంతే. అమావాస్య రోజును మన ప్రాంతంవారు అశుభదినంగా పరిగణిస్తున్నారు కాని, కొన్ని ప్రాంతాలవారు దానిని గొప్ప సుదినంగా భావించి శుభకార్యాలు చేసుకుంటున్నారు. నిజంగా అది కూడా మంచిరోజే. ఎందుచేతనంటే ఆరోజు పగలు సూర్యప్రకాశంతోబాటు చంద్రప్రకాశం కూడా మన భూమిమీద పడుతుంది. దాని ప్రభావం స్థావర జంగమ ప్రాణులన్నిటి మీద పడుతుంది. మూలికా వైద్యులు కొన్ని మూలికలను ప్రత్యేకంగా ఆరోజే సేకరిస్తారు. కొన్ని జంతువులలోనూ ఈ మార్పు కనబడుతుంది. కొన్ని మానసిక

శారీరక రోగాలు కొందరిలో ఆరోజు ఎక్కువ కావటం, కొందరిలో ఉపశమించటం జరుగుచున్నవని శాస్త్రజ్ఞులు గుర్తించారు. కనుక మన ఋషులు ఆరోజు దైనిక అగ్నిహోత్రంలో కొన్ని విశేష మంత్రాలతో ఆహుతులివ్వాలని నిర్దేశించారు.

**ఓం అగ్నయే స్వాహా ॥ - ఇదమగ్నయే - ఇదం న మమ.**

**ఓం ఇంద్రాగ్నీభ్యాం స్వాహా ॥ - ఇదమిన్ద్రాగ్నీభ్యామ్ - ఇదం న మమ.**

**ఓం విష్ణవే స్వాహా ॥ - ఇదం విష్ణవే - ఇదం న మమ.**

**ఓం భూరగ్నయే స్వాహా ॥ - ఇదమగ్నయే - ఇదం న మమ.**

**ఓం భువర్వాయవే స్వాహా ॥ - ఇదం వాయవే - ఇదం న మమ.**

**ఓం స్వరాదిత్యాయ స్వాహా ॥ - ఇదం మాదిత్యాయ - ఇదం న మమ.**

**ఓం భూర్ భువః స్వః అగ్ని వాయ్వాదితేభ్యః స్వాహా ॥**
**ఇద మగ్ని వాయ్వాదితేభ్యః - ఇదం న మమ.**

పై మంత్రాలలో రెండవ మంత్రం ఒక్కటే తేడాగా ఉంది. మిగిలిన మంత్రాలన్నీ 'పౌర్ణమాస్యేష్టి వలెనే ఉన్నాయి. రెండవ మంత్రంతో ఇంద్ర + అగ్నులకు ఆహుతి ఇస్తారు. ఇంద్రుడంటే 'విద్యుత్' అని అర్థం. అంటే సృష్టిలో ఉండే స్థిరవిద్యుత్.'

అమావాస్యనాటి రాత్రి ప్రాణులను కాపాడుతున్నదని కొందరంటారు. ఇంతవరకు మనం భౌతిక అమావాస్యను గురించి చెప్పుకున్నాము. ఇక అమావాస్య దేవుని గురించి తెలుసుకుందాము.

సర్వవ్యాపకుడు, సర్వేశ్వరుడు, సృష్టిస్థితిలయకర్తయైన ఏకేశ్వరునికే అమావాస్యుదని మరొక పేరు. 'అమా' అంటే 'తోడుగా' అని అర్థం. వాస్యుడు అంటే వసించేవాడు. రెండు పదములు కలిసి అమావాస్యుడు - తోడుగా ఉ ండేవాడని అయ్యింది. అయిన వారందరికన్న ఎక్కువగా తోడుగా ఉండేవాడు కనుక పరమేశ్వరుని అమావాస్యుదని అంటుంది వేదం. అమావాస్య రోజున చంద్రునికి సూర్యుడు తోడుగా ఉంటాడు కనుక అది భౌతిక అమావాస్య అయ్యింది. అందుచే ఆ రోజు ప్రాకృతిక దేవతలకిచ్చే ఆహుతులతోబాటు అమావాస్యాదేవునికి కూడా అథర్వవేదంలోని అమావాస్య సూక్తంతో ఆహుతులిస్తారు కొందరు.

ఆ మంత్రాలలో చక్కటి అర్థం ఉంటుంది. పరిశీలించండి.

**ఓం యత్ తే దేవా అకృణ్వన్ భాగధేయమమావాస్యే**
**సం వసన్తో మహిత్వా ।**
**తేనా నో యజ్ఞం పిపృహి విశ్వవారే రయిం నో**
**ధేహి సుభగే సువీరమ్ స్వాహా.**
**ఇదం అమావాస్యామై ఇదం న మమ.**

ఓ అమావాస్యుడా! సర్వకాల సర్వావస్థలయందు మాకు తోడుగా ఉండే ఓ సర్వవ్యాపక సర్వేశ్వరా! ఏవిధంగా దేవతలు (దివ్యగుణాలు కలవారు) తమ తమ కర్తవ్య కర్మలను చక్కగా ఆచరిస్తారో, ఆవిధంగా మేమునూ వేదవిహిత పంచమహాయజ్ఞాది కర్తవ్య కర్మలను చేయుదుముగాక! ఓ విశ్వవారా! అందరిచేత కోరబడు ఓ పరమేశ్వరా! మాకు యజ్ఞములను (సత్కర్మలను) చక్కగా నెరవేర్చగల శక్తినిచ్చి వాటిని పూరింపుము. వాటి ఫలాలను ప్రసాదింపుము. ఓ సుభగా! పరమ సౌభాగ్యవంతుడా! మాకు సువీరులతో కూడిన ధనముల నిమ్ము.

**ఓం అహమేవాస్మ్యమావాస్యా3మామా వసన్తి సుకృతో మయీమే ।**
**మయి దేవా ఉభయే సాధ్యాశ్చేన్ద్ర జేష్ఠాః సమగచ్ఛన్తి సర్వే స్వాహా.**
**ఇదం అమావాస్యాయై - ఇదం న మమ.**

అమావాస్య దేవుడు ఏమంటున్నాడంటే - ఓ మానవులారా! నేనే మీకు సదా తోడుగా ఉండే అమావాస్యుడను. నాయందే సుకృతులు సుఖాల ననుభవిస్తూ వసిస్తారు. ఉభయరకాల స్థావర జంగమ ప్రాణులునూ వాటి వాటి కర్మఫలాల ననుభవిస్తూ నాయందే వసించుచున్నవి.

**ఓం ఆగన్‌రాత్రీ సంగమనీ వసూనామూర్జం పుష్టం వస్వా వేశయన్తీ ।**
**అమావాస్యాయై హవిషా విధేమోర్జం దుహానా పయసా న ఆగన్**
**స్వాహా. ఇదం అమావాస్యాయై - ఇదం న మమ.**

ఓ పరమేశ్వరా! నిన్ను ధ్యానిస్తూ నీ సంయోగం చేయు రాత్రి వచ్చినది. కనుక ఈరోజు మేము విధేయతతో సత్కర్మలచే హవిస్సులను అర్పింతుముగాక! నీవు జ్ఞానంతో కూడిన పరాక్రమాన్ని ప్రసాదించి మమ్ము తృప్తి పరుచుము.

**ఓం అమావాస్యే న త్వదేతాన్యన్యో విశ్వరూపాణి పరిభూర్జజాన ।**
**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో**
**రయీణాం స్వాహా. ఇదం అమావాస్యాయై - ఇదం న మమ.**

- అథర్వవేదం

ఓ అమావాస్యుడా! ఈ నామ రూపాత్మక జగత్తునంతటిని ఉత్పన్నముచేసి, అన్నివైపులనుండి కప్పుచు అన్నిటినీ నీ ఒడిలో కలిగియున్న వేరొక దేవుడు లేనేలేడు. కనుక మేము కేవలం నిన్నే ఉపాసింతుము గాక. మేము ఏ ఏ కోరికతలతో పూర్ణ పురుషార్థం చేయుదుమో వాటన్నిటిని మాకు ప్రసాదింపుము. నీ కృపవలన మేము అన్నిరకాల ధనాలకు - ఐశ్వర్యాలకు పతుల మగుదుము గాక - స్వాముల మగుదుము గాక!

పై మంత్రాలతో అగ్నిహోత్రంలో ఆహుతులిచ్చేటప్పుడు మంత్రాల చివర "స్వాహా" కారం పలకాలి. అనంతరం "ఇదం అమావాస్యాయై ఇదం న మమ" అనే వాక్యాన్ని ఉచ్చరించాలి. అస్తు - మనం అట్లే చేయుదముగాక!

## విశేషాహుతుల మంత్రములు

బృహద్ యజ్ఞానంతరం పై అమావాస్యేష్టి మంత్రాలతో ఆహుతులిస్తే సరిపోతుంది. ఎక్కువ ఆహుతులివ్వగోరేవారు అథర్వ వేదీయ శాంతిసూక్తంతోను, గాయత్రీ మంత్రంతోను ఆహుతులివ్వవచ్చు.



# వైదిక పర్వ పద్ధతి (విశేష పర్వ హోమాలు)

ప్రపంచమునగల నెల్లదేశవాసులు సంవత్సరమున కొన్ని నియత దినములను పండుగలుగా నెంచి ఆయాదినములందు ఆనందోత్సాహములతో సమయము గడుపుదురు. భారతదేశవాసులైన ఆర్యులును అట్లే కొన్ని దినములను పండుగలుగా నెంచి ఆ దినములందు ప్రతిదినము చేయు సామాన్య కార్యకలాపములు విడిచి విలక్షణముగ ఆనందోత్సాహములతో కాలము గడుపుదురు. గృహాదులను శుద్ధము చేసి, ద్వారములను పచ్చతోరణములతోను, పూలదండలతోను అలంకరింతురు. నూతన లేక శుద్ధ వస్త్రములను ధరింతురు. భోజ్య పదార్థములను విశిష్టరూపమున సిద్ధము చేసికొని భుజింతురు.

కొన్ని పండుగలు కాల, ఋతు పరివర్తనమునకు చెందినవిగాను, కొన్ని మహాపురుషులకు సంబంధించినవిగాను ఉండును.

వైదికులయిన ఆర్యులు ఆ పండుగ దినములలో నిత్యకర్మలయిన పంచ మహాయజ్ఞములను యథాశక్తి నాచరించుచు, అగ్నిహోత్రము చేయుచున్నప్పుడు, అందు ఆయా పర్వదినములకు సంబంధించిన విధి ననుసరించి విశేషాహుతులను కూడ ఇచ్చి పండుగ విధిని గూడ నిర్వర్తింతురు. అట్టివారికి పర్వ పద్ధతి – పండుగల విధానము ఉపకరించును. అదియే ఈ పుస్తక ప్రచురణకు ముఖ్య ప్రయోజనము.

## 1. నూతన సంవత్సరోత్సవము (యుగాది)

### మేష సంక్రాంతి - చైత్ర శు. 1 పాడ్యమి

### యుగాది - సంవత్సరాది పర్వము

క్రింది విశేష మంత్రములతో ఆహుతులివ్వాలి.

ఓం సంవత్సరోఽసి పరివత్సరోఽసీదా
వత్సరోసీద్వత్సరోసి వత్సరోసి ।
ఉషసస్తే కల్పన్తా మహోరాత్రస్తే కల్పన్తా
మర్ధమాసాస్తే కల్పన్తాం మాసాస్తే కల్పన్తామ్
ఋతవస్తే కల్పన్తాగ్ం సంవత్సరస్తే కల్పతామ్ ।

ప్రేత్యా ఏత్యై సఞ్చాఞ్చ ప్ర చ సారయ । సుపర్ణ
చిదసి తయా దేవతాయఙ్గిరస్వద్ ధ్రువః సీద ॥స్వాహా॥(యజు. 27-45)

ఓం యమాయ యమసూమథర్వభ్యో౽
వతోకాః సంవత్సరాయ పర్యాయిణీం
పరివత్సరాయా విజాతామిదా
వత్సరాయాతీత్వరీమ్ ఇద్వత్సరాయా
తిష్కద్వరీం వత్సరాయ విజర్జరాః
సంవత్సరాయ పలిక్నీమృభుభ్యో౽
జినసన్ధగ్ం సాధ్యేభ్యశ్చర్మమ్నమ్ ॥స్వాహా॥ (యజు. 30-15)

ఓం ద్వాదశ ప్రధయశ్చక్రమేకం
త్రీణి నభ్యాని క ఉ తచ్చికేత ।
తస్మిన్త్సాకం త్రిశతా న శంకవోర్పితాః
షష్టిర్న చలాచలాసః ॥స్వాహా॥ (ఋ. 1-164-48)

ఓం సప్తయుఞ్జన్తి రథమేకచక్రమేకో
అశ్వోవహతి సప్తనామా । త్రినాభి చక్రమజర మనర్వం
యత్రేమా విశ్వా భువనాధితస్థుః ॥స్వాహా॥ (ఋ. 1-164-2)

ఓం ద్వాదశారం నహి తజ్జరాయవర్వర్తి చక్రం
పరిద్యామృతస్య । ఆపుత్రా అగ్నే మిథునాసో
అత్ర సప్తశతాని వింశతిశ్చ తస్థుః ॥స్వాహా॥ (ఋ. 1-164-11)

ఓం పంచపాదం పితరం ద్వాదశాకృతిందివ ఆహుః
పరే అర్ధే పురీషిణమ్ । అథేమే అన్య ఉపరే
విచక్షణం సప్తచక్రే షళర ఆహురర్పితమ్ ॥స్వాహా॥

(ఋ. 1-164-12)

ఓం పంచారే చక్రే పరివర్తమానే తస్మిన్నా
తస్థుర్భువనాని విశ్వా । తస్య నా క్షస్తప్యతే
భూరిభారః సనాదేవ న శీర్యతే సనాభిః ॥స్వాహా॥

(ఋ. 1-164-13)

ఓం సనేమి చక్రమజరం వివావృత ఉత్తానాయం
దశ యుక్తా వహన్తి । సూర్యస్య చక్షూ రజసైత్యావృతం
తస్మిన్నార్పితా భువనాని విశ్వా ॥స్వాహా॥ (ఋ. 1-164-14)

ఓం సంవత్సరస్య ప్రతిమాం యాం త్వా రాత్ర్యుపాస్మ హే ।
సా న ఆయుష్మతీం ప్రజాం
రాయస్పోషేణ సంసృజ ॥స్వాహా॥ (అథ. 3-10-3)

ఓం యస్మాన్మాసా నిర్మితాః త్రింశదరాః
సంవత్సరో యస్మాన్నిర్మితో ద్వాదశారః ।
అహోరాత్రా యం పరియన్తో నాపుస్తే
నౌదనేనాతి తరాణి మృత్యమ్ ॥స్వాహా॥ (అథ. 4-35-4)

## 2. ఆర్య సమాజ స్థాపనా దివసము

### చైత్ర శు 1 పాడ్యమి

క్రింది విశేష మంత్రములతో ఆహుతులివ్వాలి.

ఓం సం జానీధ్వం సం పృచ్యధ్వం సం వో
మనాంసి జానతామ్ । దేవా భాగం యథా
పూర్వే సంజానానా ఉపాసతే ॥స్వాహా॥ (అథ. 6-64-1)

ఓం సం వః పృచ్యన్తాం తస్యః సం మనాంసి
సము వ్రతా । సం వోఽయం బ్రహ్మణస్పతిర్భగః
సం వో అజీగమత్ ॥స్వాహా॥ (అథ. 6-74-1)

ఓం జ్యాయస్వన్తశ్చిత్తినో మా వి యౌష్ట సంరాధయన్తః
సధురాశ్చరన్తః । అన్యో అన్యస్మై వల్గు వదన్త ఏత
సధ్రీచీనా న్వః సంమనస్కృణోమి ॥స్వాహా॥ (అథ. 3-30-5)

ఓం సమానీ ప్రపా సహ వో న్నభాగః సమానే
యోక్త్రే సహ వో యునజ్మి । సమ్యంచోగ్నిం
సపర్యతారా నాభిమివాభితః ॥స్వాహా॥ (అథ. 3-30-6)

ఓం సధ్రీ చీనా న్వః సంమనస స్కృణోమ్యేక శ్నుష్టీన్సం
వననేన సర్వాన్ । దేవాఇవామృత రక్షమాణాః

సాయం ప్రాతః సౌమనసో వో అస్తు ॥స్వాహా॥ (అథ. 3-30-7)

ఓం సం వో మనాంసి సం వ్రతా సమాకూతీర్నమయా
మసి । అమి యే వివ్రతాస్థన తాన్వః
సం నమయా మసి ॥స్వాహా॥ (అథ.6-94-1)

ఓం సమానో మన్త్రః సమితిః సమానీ సమానం మనః
సహచిత్త మేషామ్ । సమానం మన్త్ర మభిమంత్రయే వః
సమానేన వో హవిషా జుహోమి ॥స్వాహా॥ (ఋ. 10-191-3)

ఓం సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః । సమానమస్తు
వో మనో యథా వః సుసహాసతి ॥స్వాహా॥ (ఋ. 10-191-4)

ఓం తత్సవితు ర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ।
ధియో యో నః ప్రచోదయాత్ ॥స్వాహా॥ (య. 3-62-10)

ఓం దృతే దృగ్ంహ మా మిత్రస్య మా చక్షుషా
సర్వాణి భూతాని సమీక్షన్తామ్ ।
మిత్రస్యా హం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే ।
మిత్రస్యౖ చక్షుషా సమీక్షామహే ॥స్వాహా॥ (య. 36-18)

## 3. శ్రీరామనవమి ఉత్సవము

### చైత్ర శుద్ధ (9) నవమి శ్రీరామచంద్రుడు జన్మించిన దినము

నేడు లక్షలాది సంవత్సరాలు గడచిన తరువాత కూడా మర్యాదా పురుషోత్తముడైన శ్రీరాముని వైదిక మర్యాదమయ పవిత్ర చరిత్ర ప్రజలకు ప్రేరణనిచ్చుచు మార్గదర్శకముగ నున్నది.

హిమాలయములనుండి హిందూ సముద్రము వరకు గంగానది నుండి కావేరి వరకు అంతటా రామనామమే మారుమ్రోగుచున్నది. పంజాబు, సింధు, కన్యాకుమారి రామేశ్వరముల వరకు తూర్పు పశ్చిమోత్తర దక్షిణములలో ఏ ప్రదేశమునకు పోయినా అంతటా శ్రీరాముని గూర్చిన స్మృతులు నిండియున్నాయి. నేటి పాకిస్థాన్‌లో నున్న తక్షశిల, లవపుర (లాహోర్) కుశపుర (కసూర్)లు మర్యాదా పురుషోత్తమ శ్రీరాముని వంశజుల స్మారకములే.

కవులు, మహాత్ములు, రామకథను ఒక మత సంప్రదాయమునకు పరిమితం

చేయకుండా బోధించుట వలన బౌద్ధులు, జైనులు కూడా రామకథను గానము చేయుచున్నారు. గోండులు, భిల్లులు మున్నగు అశిక్షిత వర్గముల వారు కూడా రామకథను గానము చేయుదురు. స్యామ, అనామ, జావా, కంబోడియా, ఇండోనేషియా, మలేసియా దేశాలలో కూడా రామకథ ప్రాకినది. మెక్సికోలో రామ, సీతల పేర్లతో ఉత్సవములు, ఊరేగింపులు జరుపుచుందురు. మిశ్ర (ఈజిప్టు) దేశపు రాజులు శ్రీరాముని పేర్లు పెట్టుకొందురు. బ్యాంకాక్‌లో రామాయణముపై సమ్మేళనములు జరుగుచుండును. మారిషస్‌లో తులసీ రామాయణ గుటికా ప్రతి ఇంట చదువుచుందురు.

ఏకపత్నీవ్రతుడు, పితృవాక్య పరిపాలకుడు, భాతృవత్సలుడు, సత్యసంధుడు, వైదిక సంస్కృతి పరిరక్షకుడైన శ్రీరామచంద్రుని దివ్య జీవన చరితము జనులలో ప్రచారము చేయవలెను.

**క్రింది విశేష మంత్రాలతో ఆహుతులు ఇవ్వాలి**

1. **తేజోఽసి తేజోమయి ధేహి స్వాహా ॥**
2. **వీర్యమసి వీర్యంమయి ధేహి స్వాహా ॥**
3. **బలమసి బలం ధేహి స్వాహా ॥**
4. **ఓజోస్యాజోమయి ధేహి స్వాహా ॥**
5. **మన్యురసి మన్యుమయి ధేహి స్వాహా ॥**
6. **సహోసి సహోమయిధేహి స్వాహా ॥**

## 4. శ్రావణీ ఉపాకర్మ (ఋషి తర్పణము)

పారస్కర గృహ్యసూత్రమున గల **"అథాతోఽధ్యాయోపాకర్మ"** (2-10-1)

**"ఓషధీనాం ప్రాదుర్భావే శ్రవణేన శ్రావణ్యాం పౌర్ణమాస్యాం, శ్రావణస్య పంచమీ హస్తేనవా"**

ఈ సూత్రముల ప్రమాణము ననుసరించి, శ్రవణా నక్షత్రయుక్త శ్రావణపూర్ణిమ దినమునగానీ, హస్తానక్షత్రయుక్త శ్రావణ పంచమినాడు గాని ఉ పాకర్మ చేయవచ్చునని తెలియుచున్నది.

**విశేషాహుతుల మంత్రములు**

1. బ్రహ్మణే స్వాహా ।　　2. ఛందోభ్యః స్వాహా ।

3. ఓం సావిత్ర్యై స్వాహా 4. ఓం బ్రహ్మణే స్వాహా

5. ఓం శ్రద్ధాయై స్వాహా 6. ఓం మేధాయై స్వాహా

7. ఓం ప్రజ్ఞాయై స్వాహా 8. ఓం ధారణాయై స్వాహా

9. ఓం సదస్పతయే స్వాహా 10. ఓం అనుమతయే స్వాహా

11. ఓం ఛందోభ్యః స్వాహా 12. ఓం ఋషిభ్యః స్వాహా

తరువాత నిమ్మలిఖిత ఋగ్వేద మంత్రములతో పదునొకండు ఆహుతులనివ్వవలయును.

**ఓం బృహస్పతే ప్రథమం వాచో అగ్రం యత్ప్రైరత నామధేయం దధానాః । యదేషాం శ్రేష్ఠం యదరిప్రమాసీ త్ప్రేణా తదేషాం నిహితం గుహావిః ॥స్వాహా॥** (ఋ. 10-71-1)

**ఓం సక్తుమివ తితఉనాపునన్తో యత్ర ధీరా మనసా వాచమక్రత । అత్రా సఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి ॥స్వాహా॥** (ఋ. 10-71-2)

**ఓం యజ్ఞేన వాచః పదవీయమాయన్ తామన్వవిన్దన్నృషిషు ప్రవిష్టామ్ । తామాభృత్యా వ్యదధుః పురుత్రా తాం సప్తరేభా అభిసంనవన్తే ॥స్వాహా॥** (ఋ. 10-71-3)

**ఓం ఉత త్వః పశ్యన్న దదర్శ వాచముత త్వః శృణ్వన్న శృణోత్యేనామ్ । ఉతో త్వ స్మై తన్వం వి సస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః ॥స్వాహా॥** (ఋ. 10-71-4)

**ఓం ఉత త్వం సఖ్యే స్థిరపీతమాహు ర్నైనం హిన్వన్త్యపి వాజినేషు । అధేన్వా చరతి మాయయైష వాచం శుశ్రువాం అఫలామపుష్పామ్ ॥స్వాహా॥** (ఋ. 10-71-5)

**ఓం యస్తిత్యాజ సచివిదం సఖాయం న తస్య వాచ్యపి భాగో అస్తి । యదీం శృణోత్యలకం శృణోతి నహి ప్రవేద సుకృతస్య పన్థామ్ ॥స్వాహా॥** (ఋ. 10-71-6)

**ఓం అక్షణ్వన్తః కర్ణవన్తః సఖాయో మనోజవేష్వ సమా**

**బభూవుః । ఆదఘ్నా స ఉపకక్షాస ఉ త్వే హ్రదాఇవ**
**స్నాత్వా ఉ త్వే దదృశే ॥స్వాహా॥** (ఋ. 10-71-7)

**ఓం హృదా తష్టేషు మనసో జవేషు యద్ బ్రాహ్మణాః**
**సయజన్తే సఖాయః అత్రాహ త్వం వి జుహుర్వేద్యాభిరోహ**
**బ్రహ్మాణో వి చరన్త్యు త్వే ॥స్వాహా॥** (ఋ. 10-71-8)

**ఓం ఇమే యే నార్వాఙ్ న పరశ్చరన్తి న బ్రాహ్మణాసో**
**న సుతేకరాసః । త ఏతే వాచమభిపద్య పాపయా**
**సిరీస్తంత్రం తన్వతే అప్రజజ్ఞయః ॥స్వాహా॥** (ఋ. 10-71-9)

**ఓం సర్వే నన్దన్తి యశసాగతేన సభాసాహేన**
**సఖ్యా సఖాయః । కల్బిషస్పృత్ పితుషణిర్హ్యేషామరం**
**హితో భవతి వాజినాయ ॥స్వాహా॥** (ఋ. 10-71-10)

**ఓం ఋచాం త్వః పోషమాస్తే పుపుష్వాన్ గాయత్రం**
**త్వో గాయతి శక్వరీషు । బ్రహ్మా త్వో వదతి జాతవిద్యాం**
**యజ్ఞస్య మాత్రాం వి మిమీత ఉ త్వః ॥స్వాహా॥** (ఋ. 10-71-11)

**ఓం సదసస్పతి మద్భుతం ప్రియ మింద్రస్య**
**కామ్యమ్ సనిం మేధా మయాసిషగ్ం ॥స్వాహా॥** (యజు. 32-13)

పై మంత్రములతో యజమాని - గృహపతి పత్నీ సమేతుడై యాహుతులనివ్వవలెను. అనంతరము ఉపాకర్మలో పాల్గొనిన వారందరు మూడు సమిధలు తీసికొని, వానిని నేతిలో ముంచి గాయత్రీ మంత్రము పఠించి 'స్వాహా' యని ఒక్కొక్క సమిధను ఆహుతిగా యజ్ఞకుండమున నుంచవలెను. తరువాత స్విష్టకృత్ ఆహుతి 'యదస్యకర్మణో....' అను మంత్రముతో ఆహుతి నిచ్చి యజ్ఞకార్యము సమాప్తము చేయవలయును.

ఆపై చతుర్వేద మంత్ర పఠనము చేయవలయును.

**ఋగ్వేదము**

**ఓం అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజమ్ ।**
**హోతారం రత్న ధాతమమ్.** (ఋ. 1-1-1)

**ఓం సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః ।**

సమానమస్తు వో మనో యథా వః సుసహాసతి. (ఋ. 10-191-4)

**యజుర్వేదము**

ఓం ఇషే త్వోర్జే త్వా వాయవ స్థ దేవో వః
సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ
ఆప్యాయధ్వ మఘ్న్యా ఇంద్రాయ భాగం
ప్రజావతీరనమీవా అయక్ష్మా
మ వ స్తేన ఈశత మాఘశగ్ంసో
ధ్రువా అస్మిన్ గోపతౌస్యాత
బహ్వీర్యజమానస్య పశూన్ పాహి. (యజు. 1-1)

ఓం హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖమ్ ।
యోఽ_సావాదిత్యే పురుషః సోఽ_సావహం ఓం ఖం బ్రహ్మ.
(యజు. 40-17)

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం
పశ్యేమాక్షభిర్యజత్రాః । స్థిరై రంగైస్తుష్టువాగ్ం
సన్తనూభిర్వ్యశేమహి దేవహితం యదాయుః (యజు. 25-21)

ఓం స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా
విశ్వవేదాః । స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తి నో బృహస్పతిర్దధాతు

**సామవేదము**

ఓం అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే
నిహోతా సత్సి బర్హిషి. (సామ. 1-1)

ఓం మృగో న భీమః కుచరో గిరిష్ఠాః పరావత
ఆ జగన్థా పరస్యాః । సృకం సంశాయ పవిమిన్ద్ర
తిగ్మం వి శత్రూన్తాఢి వి మృధో నుదస్వ. (సామ. 9-1)

**అథర్వవేదము**

ఓం శన్నో దేవీ రభిష్టయ ఆపో భవన్తు పీతయే
శం యో రభిస్రవన్తు నః. (యజు. 36-12)

**ఓం పనాయ్యం తదశ్వినా కృతం వాం వృషభో దివో రజసః పృథివ్యాః । సహస్రశంస్తాఉతయే గవిష్టౌ సర్వామిత్ తాముపయాతా పిబధ్యై.**

ఈ మంత్రముల పిదప ఈ క్రింది మంత్రమును పఠింపవలెను.

**ఓం సహ నోఽ_స్తు సహ నోఽ_వతు**
**సహన ఇదం వీర్యవదస్తు ।**
**బ్రహ్మ ఇంద్రస్తద్వేద యేన**
**యథా న విద్విషా మహే.**

తదుపరి సామవేదమునకు సంబంధించిన వామదేవ్యగానము చేయవలయును.

శాంతి పాఠముతో సమాప్తము చేయవచ్చును.

## 5. శ్రీకృష్ణ జన్మాష్టమి

శ్రీకృష్ణుడు శ్రావణ బహుళ (8) అష్టమినాడు జన్మించెను. ఆయన భారతదేశములో జన్మించిన మహా పురుషులలో ప్రసిద్ధుడు. మహాభారతము నందు వర్ణింపబడిన శ్రీకృష్ణుడు గొప్ప రాజనీతివేత్తగాను, వేదవేదాంగవిదుడుగాను, యోగి పుంగవుడుగాను తెలియనగును. ద్వాపరాంతమున యదువంశమున జన్మించి నాటి దుష్ట రాజులను చంపి, చంపించి, ధర్మస్థాపనకు తోడ్పడినట్లు చరిత్ర వలన తెలియును. కావున భారతీయులు – వైదికులు శ్రీకృష్ణుడు జన్మించిన దినమును పండుగగా జరుపుకొందురు.

**ఓం తేజోఽ_సి తేజో మయిధేహి స్వాహా**
**ఓం వీర్యమసి వీర్యం మయిధేహి స్వాహా**
**ఓం బలమసి బలం మయిధేహి స్వాహా**
**ఓం ఓజోఽ_స్యోజో మయి ధేహి స్వాహా**
**ఓం మన్యురసి మన్యుం మయిధేహి స్వాహా**
**ఓం సహోఽ_సి సహోమయి ధేహి స్వాహా** (యజు. 19–9)

## 6. విజయదశమి

ఆశ్వయుజ శుద్ధ దశమి విజయదశమి పండుగగా భారతీయులలో వైదికులు భావించి, నాడు విజయోత్సాహముతో సమయము గడుపుదురు. పండుగలలో ఆశ్వయుజ శుద్ధ 10, ప్రసిద్ధ పండుగ దినము.

**విశేషాహుతుల మంత్రములు**

**ఓం సంశితం మ ఇదం బ్రహ్మ సంశితం**
**వీర్యం బలమ్ । సంశితం క్షత్ర మజర**
**మస్తు జిష్ణుర్యేషామస్మి పురోహితః ॥స్వాహా॥**

**ఓం సమహమేషాం రాష్ట్రం స్యామి సమోజో**
**వీర్యం బలమ్ । వృశ్చామి శత్రూణాం**
**బాహూ ననేన హవిషాహమ్ ॥స్వాహా॥**

**ఓం నీచైః పద్యన్తామధరే భవన్తు యే నః**
**సూరిం మఘవానం పృతన్యాన్ । క్షిణామి**
**బ్రహ్మణా మిత్రా నున్నయామి స్వానహమ్ ॥ స్వాహా॥**

**ఓం తీక్ష్ణీయాంసః పరశో రగ్నేస్తీక్ష్ణతరా ఉత ।**
**ఇంద్రస్య వజ్రా త్తీక్ష్ణీయాంసో**
**యేషామస్మి పురోహితః ॥స్వాహా॥**

**ఓం ఏషామహమాయుధా సంశ్యా మ్యేషాం**
**రాష్ట్రం సువీరం వర్ధయామి । ఏషాంక్షత్రమజరమస్తు**
**జిష్ణ్వేషాం చిత్తం విశ్వేఽవస్తు దేవాః ॥స్వాహా॥**

**ఓం ఉద్ధర్షన్తాం మఘవ న్వాజినా న్యుద్వీరాణాం**
**జయతామేతు ఘోషః । పృథగ్ ఘోషా ఉలులయః**
**కేతుమన్త ఉదీరతామ్ దేవా ఇన్ద్రజ్యేష్ఠా**
**మరుతో యన్తు సేనయా ॥స్వాహా॥**

**ఓం ప్రేతా జయతా నర ఉగ్రా వః సన్తు బాహవః ।**
**తీక్ష్ణేషవో బలధన్వనో హతో**
**గ్రాయుధా అబలానుగ్ర బాహవః ॥స్వాహా॥**

**ఓం అవసృష్టా పరాపత శరవ్యే బ్రహ్మసంశితే ।**

**జయామిత్రాన్ ప్రపద్యస్వ జహ్యేషాం**
**వరంవరం మామీషాం మోచి కశ్చన ॥స్వాహా॥**

(అథ. 3-19-1 నుండి 8 వరకు)

**ఓం యే బాహవో యా ఇషవో ధన్వనాం వీర్యాణిచ**
**అసీన్పరశూనాయుధం చిత్తాకూతం చ యద్ధృది ।**
**సర్వం తదర్బుదే త్వమమిత్రేభ్యో**
**దృశే కురుదారాంశ్చ ప్రదర్శయ ॥స్వాహా॥**

**ఓం ఉత్తిష్ఠత సంనహ్యధ్వం మిత్రా దేవజనా**
**యూయమ్ । సందృష్టా గుప్తా వః సన్తు**
**యా నో మిత్రాణ్యర్బుదే ॥స్వాహా॥**

**ఓం ఉత్తిష్ఠత మారభేథాం ఆదానసందానాభ్యామ్**
**అమిత్రాణాం సేనా అభిధత్త మర్బుదే ॥స్వాహా॥**

(అథ. 11-9-1 నుండి 3 వరకు)

## 7. దీపావళి

### శారదీయ నవ సస్యేష్టి

### శ్రీమద్దయానంద నిర్వాణ దినము

గోభిలీయ, పారస్కర, ఆపస్తంబాది గృహ్యసూత్రములందును, మన్వాది ధర్మశాస్త్రములందును నవసస్యేష్టి జరుపు విధానములు చూడనగును.

**"సస్యాన్తే నవసస్యేష్ట్యా**
**తథర్త్వంతే ద్విజోఽధ్వరైః"** (మను. 4-26)

ఈ శ్లోకము నందు నవసస్యేష్టి విధానము చూడనగును.

నవసస్యేష్టి - క్రొత్త పంటతో చేయబడు యజ్ఞము

ఇది శరదృతువునందు వచ్చును, కావున శారదీయ నవసస్యేష్టి యనబడును.

ఆశ్వయుజ 15, అమావాస్య రాత్రి దీపములతో గృహములను అలంకరించుదురు. కావున దీపావళి పండుగ యని దీనికి పేరు.

**విశేషాహుతుల మంత్రములు**

ఓం పరం మృత్యో అనుపరేహి పన్థాం యస్తే స్వ ఇతరో
దేవయానాత్ । చక్షుష్మతే శృణ్వతే తే బ్రవీమి
మా నః ప్రజాం రీరిషో మోత వీరాన్ ॥స్వాహా॥

ఓం మృత్యోః పదం యోపయన్తో యద్రైతద్రాఘీయ
ఆయుః ప్రతరం దధానాః । ఆప్యాయమానాః
ప్రజయా ధనేన శుద్ధాః పూతా భవత యజ్ఞియాసః ॥స్వాహా॥

ఓం ఇమే జీవా విమృతై రావవృత్రన్నభూద్భద్రా దేవ -
హూతిర్నో అద్య । ప్రాఞ్చో అగామ నృతయే
హసాయ ద్రాఘీయ ఆయుః ప్రతరం దధానాః ॥స్వాహా॥

ఓం ఇమం జీవేభ్యః పరిధిం దధామి మైషాం ను గాద
పరో అర్థమేతమ్ । శతం జీవన్తు శరదః పురూ
చీరంతర్మృత్యుం దధతాం పర్వతేన ॥స్వాహా॥

ఓం యథాహాన్యనుపూర్వం భవన్తి యథా ఋతవ
ఋతిభిర్యన్తి సాధు । యథా న పూర్వ మపరో
జహాత్యేవా ధాతరాయూంషి కల్పయైషామ్ ॥స్వాహా॥

(ఋ. 10-18-1 నుండి 5 వఱకు)

ఓం ఆయుష్మతామాయుష్కృతాం ప్రాణేన జీవ మా
మృథాః । వ్యహం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ
సమాయుషా ॥స్వాహా॥ (అథ. 3-31-8)

ఓం బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుమపాఘ్నత ।
ఇంద్రో హ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరాభరత్ ॥స్వాహా॥

(అథ. 11-5-19)

ఓం శతాయుధాయ శతవీర్యాయ శతోతయేభి మాతి
షాహే । శతం యోనః శరదో అజీజాదింద్రో నేష
దతి దురితాని విశ్వా ॥స్వాహా॥

ఓం యే చత్వారః పథయో దేవయానా అన్తరా ద్వావా

పృథివీ వియన్తి । తేషాం యో ఆజ్యాని మజీజి
మావహస్త స్మై నో దేవాః పరిదత్తేహ సర్వే ॥స్వాహా॥

ఓం గ్రీష్మో హేమన్త ఉత నో వసన్తః శరద్వర్షాః
సువితన్నో అస్తు । తేషామృతూనాగ్ం శతశారాదానాం
నివాత ఏషామభయే స్యామ ॥స్వాహా॥

ఓం ఇద్వత్సరాయ పరివత్సరాయ సంవత్సరాయ
కృణుతాబృహన్నమః । తేషాం వయగ్ం సుమతౌ
యజ్ఞియానాం జ్యోగ్ జీతా అహతాః స్యామ ॥స్వాహా॥
(గో.భి.గృహ్య సూ. 3-7-10,11) (మం.బ్రా. 2-1-9 నుండి 12 వరకు)

ఓం పృథివీ ద్యౌః ప్రదిశో దిశో యస్మై ద్యుభిరా
వృతాః । తమిహేన్ద్రముపహ్వయే శివానః సన్తు
హేతయః ॥స్వాహా॥

ఓం యన్మేకించిత దుపేప్సిత మస్మిన్ కర్మణి
వృత్రహన్ । తన్మే సర్వగ్ం సమృధ్యతాం జీవతః
శరదః శతమ్ ॥స్వాహా॥

ఓం సంపత్తిర్భూతి ర్భూమిర్వృష్టిర్జ్యైష్ఠ్యగ్ం
శ్రైష్ఠ్యగ్ం శ్రీః ప్రజామిహావతు ॥స్వాహా॥
ఇదమింద్రాయ ఇదం న మమ

ఓం యస్యాభావే వైదిక లౌకికానాం భూతిర్భవతి
కర్మణామ్ । ఇంద్రపత్నీ ముపహ్వయే సీతాగ్ం
సా మే త్వనపాయినీ భూయాత్ కర్మణి కర్మణి ॥స్వాహా॥
(ఇదమింద్రపత్న్యై ఇదం న మమ.)

ఓం అశ్వావతీ గోమతీ సూనృతావతీ బిభర్తి
ప్రాణభృతో అతంద్రితా । ఖలా మాలినీ ముర్వ
రామస్మిన్ కర్మణ్యుపహ్వయే ధ్రువాగ్ం సా మే
త్వనపాయినీ భూయాత్ ॥స్వాహా॥
(ఇదం సీతాయై ఇదన్న మమ.)

ఓం సీతాయై స్వాహా ॥ ఓం ప్రజాయై స్వాహా ॥
ఓం శమాయై స్వాహా ॥ ఓం భూత్యై స్వాహా ॥
(పార. 2-17-7 నుండి 10)

ఓం వ్రీహయశ్చ మే యవాశ్చ మే మాషాశ్చ మే తిలాశ్చ మే
ముద్గాశ్చ మే ఖల్వాశ్చ మే ప్రియజ్గ వశ్చమేఽ_ణవశ్చమే
శ్యామాకాశ్చమే నీవారాశ్చమే గోధూమాశ్చమే
మసూరాశ్చమే యజ్ఞేన కల్పన్తామ్ ॥స్వాహా॥

ఓం వాజో నః సప్తప్రదిశశ్చతస్రో వా పరావతః ।
వాజో నో విశ్వైర్దేవైర్ధనసాతా విహావతు ॥స్వాహా॥

ఓం వాజో నో అద్య ప్రసువాతి దానం వాజో దేవా
ఋతుభిః కల్పయాతి । వాజో హి మా సర్వ వీరం
జజాన విశ్వా ఆశా వాజపతిర్జయేయమ్ ॥స్వాహా॥

ఓం వాజః పురస్తాదుత మధ్యతో నో వాజో దేవాన్
హవిషా వర్ధయాతి । వాజో హి మా సర్వవీరం
చకార సర్వా ఆశా వాజపతి ర్భ వేయమ్ ॥స్వాహా॥

(య. 18-12, 32, 33, 34)

ఓం సీరా యుఞ్జన్తి కవయో యుగా వి తన్వతే పృథక్ ।
ధీరా దేవేషు సుమ్నయౌ ॥స్వాహా॥

ఓం యునక్త సీరా వి యుగా తనోత కృతే యోనౌ
వపతేహ బీజమ్ । విరాజః శ్నుష్టిః సభరా అసన్నో
నేదీయ ఇత్సృణ్యః పక్వమా యవన్ ॥స్వాహా॥

ఓం లాఙ్గలం పవీరవ త్సుశీమం సోమసత్సరు । ఉది
ద్వపతు గామవిం ప్రస్థావ ద్రథవాహనం పీవరీం చ
ప్రఫర్వ్యమ్ ॥స్వాహా॥

ఓం ఇంద్రః సీతాం నిగృహ్ణాతు తాం పూషాభిరక్షతు ।
సానః పయస్వతీ దుహాముత్తరా ముత్తరాం సమామ్ ॥స్వాహా॥

ఓం శునం సుఫలా వితుదన్తు భూమిం శునం కీనాశా

అను యన్తు వాహాన్ । శునాసీరా హవిషా తోశమానా
సుపిప్పలా ఓషధీః కర్తమస్మై ॥స్వాహా॥

ఓం శునం వాహాః శునం నరః శునం
కృషతు లాఙ్గలమ్ । శునం పరత్రా
బధ్యన్తాం శునముష్ట్రాముదిఙ్గ య ॥స్వాహా॥

ఓం శునాసీరేహ స్మ మే జుషేథామ్ । యద్దివి చక్రథుః
పయస్తే నేమాముప సిఞ్చతమ్ ॥స్వాహా॥

ఓం సీతే వన్దామహే త్వార్వాచీ సుభగే భవ । యథా నః
సుమనా అసో యథా నః సుఫలా భువః ॥స్వాహా॥

ఓం ఘృతేన సీతా మధునా సమక్తా విశ్వైర్దేవైరనుమతా
మరుద్భిః । సా నః సీతే పయసాభ్యావవృత్
స్వోర్జస్వతీ ఘృతవ త్పిన్వమానా ॥స్వాహా॥

(అథ. 3-17-1 నుండి 9 వరకు)

ఓం ఇంద్రాగ్నీభ్యాం స్వాహా । ఇదమింద్రాగ్నీభ్యా మిదన్నమమ

ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా । ఇదం విశ్వేభ్యో
దేవేభ్య ఇదం న మమ.

ఓం ద్యావా పృథివీభ్యాం స్వాహా । ఇదం ద్యావాపృథివీభ్యా
మిదన్నమమ.

ఓం స్విష్టమగ్నే అభి తత్పృణీహి విశ్వాంశ్చ దేవః
పృతనా అభిష్యక్ । సుగన్ను పన్థాం ప్రదిశన్న
ఏహిజ్యోతిష్మద్ధ్యేహ్యజరం న ఆయుః ॥స్వాహా॥

ఓం యదస్య కర్మణోऽత్యరీరిచం యద్వా న్యూన
మిహాకరమ్ । అగ్నిష్టత్స్విష్టకృద్విద్యాత్సర్వం స్విష్టం
సుహుతం కరోతుమే అగ్నయే స్విష్టకృతే సుహుత
హుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం సమ
ర్ధయిత్రే సర్వాన్నః కామాన్ త్సమర్ధయ ॥స్వాహా॥
**(ఇదమగ్నయే స్విష్టకృతే ఇదన్న మమ.)** (పార. 1-2-10)

తదుపరి పూర్ణాహుతి నొనర్చి యజ్ఞము ముగించవలెను.

## 8. (సౌర) – మకర సంక్రాంతి

మకర సంక్రాంతి పండుగ చలికాలమునకు – శిశిర ఋతువునకు సంబంధించిన పండుగ. ఈ పండుగ దినములలో చలి ఎక్కువగా నుండును. జనవరి 14, 16 తేదీలలో నేదో యొక దినమున నీపండుగ జరుపబడుచుండును. తిలలు–నువ్వులతో చేయబడిన లడ్డూలీ దినమున భుజింతురు.

### విశేషాహుతుల మంత్రములు

**ఓం సహశ్చ సహస్యశ్చ హైమంతికావృతూ । అగ్నే రంతః శ్లేషోஉసి స్వాహా । కల్పేతామ్, ద్యావాపృథివీ స్వాహా ।**
**కల్పన్తామాప ఓషధయః స్వాహా ।**
**కల్పన్తామ్, అగ్నయః పృథఙ్మమ జ్యైష్ఠ్యాయ సవ్రతాః స్వాహా ।**
**యే అగ్నయః సమనసోஉన్త రా ద్యావాపృథివీ ఇమే**
**హైమన్తికావృతూ అభికల్పమానా ఇంద్రమివదేవా**
**అభిసంవిశన్తు, తయా దేవతయాఙ్గిరస్వద్**
**ధ్రువే సీదతమ్ ॥స్వాహా॥** (యజు. 14–27)

**ఓం తపశ్చ తపస్యశ్చ శైశిరావృతూ,**
**అగ్నేరంతః శ్లేషోஉసి స్వాహా ।**
**కల్పేతామ్, ద్యావాపృథివీ స్వాహా ।**
**కల్పన్తామాప ఓషధయః స్వాహా ।**
**కల్పన్తామ్ అగ్నయః పృథఙ్మమ జ్యైష్ఠ్యాయ సవ్రతాః స్వాహా ।**
**యే అగ్నయః సమనసోஉన్తరా ద్యావాపృథివీ ఇమే ।**
**శైశిరావృతూ అభికల్పమానా ఇంద్రమివదేవా అభిసంవిశన్తు,**
**తయా దేవతయాఙ్గి రస్వద్ ధ్రువే సీదతమ్ ॥స్వాహా॥** (యజు. 15–57)

## 9. శివరాత్రి

### ఋషిబోధోత్సవము

మాఘ బ 14 చతుర్దశి శివరాత్రి పండుగగా నెంచబడును. పౌరాణికులు నాడు పగలు ఉపవసించి సాయం శివమందిరములను జేరి, శివపూజలు

చేయుదురు. ఆర్య సామాజికులకు ఆ పూజలతో నెట్టి సంబంధము లేదు. శ్రీమద్దయానంద స్వామి బాల్యమున తండ్రితో శివరాత్రినాడు పగలు ఉపవాసము చేసి సాయంకాలము శివాలయమునకు వెళ్ళి తండ్రి చెప్పినట్లు పూజలొనర్చి, శివుని దర్శనము కొఱకు నిరీక్షించి దర్శనము కాకపోవుటచే శివలింగాదులు శివుడు కాదనియు, నిజమైన శివుని దర్శనము వలన మనుజుడు ముక్తిని బొందగలడని యాతడు తెలిసికొనెను. అట్టి బోధ దయానందునకు కలుగుటవలనను, పౌరాణికులు భావించు శివరాత్రి నిమిత్తముగా నిజమైన శివుని సాక్షాత్కారము కొరకు యోగాభ్యాసాదుల నొనర్చి శివుని సాక్షాత్కారము చేసికొని సిద్ధుడైనందున శివరాత్రిని సామాజికులు బోధజనక శివరాత్రిగా స్మరించి, నాడు తమ గృహములందు సామాన్య అగ్నిహోత్రము చేసికొందురు. శివరాత్రి నెపముతో దయానంద స్వామి దృష్టికోణముతో వేదధర్మ ప్రచారము చేయుదురు.

**ఓం నమః శంభవాయచ మయోభ వాయచ,**
**నమః శంకరాయచ మయస్కరాచ,**
**నమః శివాయచ శివతరాయచ స్వాహా॥**

## 10. వసంత పంచమి

ఈ వసంత పంచమి ప్రతి సంవత్సరము మాఘ శు॥ 5నా డొక పర్వముగా జరుపబడును. వసంత ఋతువు ప్రవేశించుటకు నింక కొంతకాలము మిగిలియుండగా నీ వసంత పంచమి తటస్థించును.

### విశేషాహుతుల మంత్రములు

**ఓం వసన్తేన ఋతునా దేవా వసవ స్త్రివృతాస్తు తాః ।**
**రథం తరేణ తేజసాహ విరింద్రేవయో దధుః ॥** (య. అ.21, మం.23)

**ఓం మధుశ్చ మాధవశ్చ వాసన్తి కావృతూ అగ్నేరన్తః శ్లేషోఽసి కల్పేతాం ద్యావా పృథివీ కల్పన్తా మాప ఓషధయః కల్పన్తా మగ్నయః పృథఙ్మమజ్యైష్ఠ్యాయ సవ్రతాః । యే అగ్నయః సమనసోఽన్తరాద్యావా పృథివీ ఇమే వాసన్తి కావృతూ అభికల్పమానా ఇంద్రమివ దేవా అభిసంవిశన్తు తయా దేవత యాంగిరస్వద్ ధ్రువేసీదతమ్ స్వాహా ॥**

(యజు. 13-25)

ఓం మధువా తా ఋతాయతే మధుక్షరన్తి సింధవః ।
మాధ్వీర్నః సన్త్వోషధీః స్వాహా ॥

ఓం మధు నక్త ము తోషసో మధు మత్పార్థివం రజః ।
మధు ద్యౌరస్తునః పితా స్వాహా ॥

ఓం మధుమాన్ నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః ।
మాద్వీర్గా వో భవన్తు నః స్వాహా ॥ (య.అ. 13 మ. 27, 28, 29)

## 11. వాసంతీ నవసస్యేష్టి (హోలి)

ఈ పర్వము వసంత ఋతువునకు సంబంధించినది. ఫాల్గున శుద్ధ 15 పూర్ణిమ నాడు ఈ పండుగ జరుపబడును.

### విశేషాహుతుల మంత్రములు

ఓం శతాయుధాయ శతవీర్యాయ శతోతయేభి
మాతిషా హే । శతం యోనః శరదో అజీజాదిన్ద్రో
నేషదతి దురితాని విశ్వా ॥స్వాహా॥

ఓం యే చత్వారః పథయో దేవయానా అన్తరా ద్యావా
పృథివీ వియన్తి । తేషాం యో ఆజ్యాని మజీజిమావ
హాస్తస్మైనో దేవాః పరిదత్తే హ సర్వే ॥స్వాహా॥

ఓం ఇమే జీవావిమృతైరావవృత్రన్న భూద్భద్రా దేవ
హూతిర్నో అద్య । ప్రాఞ్చో అగామ నృతయే
హసాయ ద్రాఘీయ ఆయుః ప్రతరం దధానాః ॥స్వాహా॥

ఓం ఇమం జీవేభ్యః పరిధిం దధామి మైషాం ను గాద
పరో అర్థమేతమ్ । శతం జీవన్తు శరదః పురూ
చీరంతర్మృత్యుం దధతాం పర్వతేన ॥స్వాహా॥

ఓం యథాహాన్యనుపూర్వం భవన్తి యథ ఋతవ
ఋతిభిర్యన్తి సాధు । యథా న పూర్వ మపరో
జహాత్యేవా ధాతరాయూంషి కల్పయైషామ్ ॥స్వాహా॥

(ఋ. 10-18-1 నుండి 5 వఱకు)

ఓం ఆయుష్మతామాయుష్కృతాం ప్రాణేన జీవ మా

మృధాః । వ్యహం సర్వేణ పాప్మనా వి యక్ష్మేణ
సమాయుషా ॥స్వాహా॥ (అథ. 3-31-8)

ఓం బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుమపాఘ్నత ।
ఇంద్రో హ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరాభరత్ ॥స్వాహా॥
(అథ. 11-5-19)

ఓం సీతాయై స్వాహా ॥

ఓం ప్రజాయై స్వాహా ॥

ఓం శమాయై స్వాహా ॥

ఓం భూత్యై స్వాహా ॥ (పా.గృ.కాం. 2)

ఓం వ్రీహయశ్చ మే యవాశ్చ మే మాషాశ్చ మే తిలాశ్చ మే
ముద్గాశ్చ మే ఖల్వాశ్చ మే ప్రియఙ్గ వశ్చ మేఽ
ణవశ్చ మే శ్యామాకాశ్చ మే నీవారాశ్చ మే,
గోధూమాశ్చ మే మసూరాశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్ ॥స్వాహా॥
(యజు. 18-12)

ఓం వాజో నః సప్తప్రదిశశ్చతస్రో వా పరావతః వాజో నో
విశ్వైర్దేవైర్ధనసాతా విహావతు ॥స్వాహా॥ (యజు. 18-32)

ఓం వాజో నో అద్య ప్రసువాతి దానం వాజో దేవా
ఋతుభిః కల్పయాతి । వాజో హి మా సర్వ
వీరం జజాన విశ్వా ఆశా వాజపతి ర్జయేయమ్ ॥స్వాహా॥
(యజు. 18-33)

ఓం వాజః పురస్తాదుత మధ్యతో నో వాజో దేవాన్
హవిషా వర్ధయాతి । వాజో హి మా సర్వవీరం
చకార సర్వా ఆశావాజపతి ర్భవేయమ్ ॥స్వాహా॥ (యజు. 18-34)

ఓం సీరా యుఞ్జన్తి కవయో యుగా వి తన్వతే పృథక్
ధీరా దేవేషు సుమ్నయౌ ॥స్వాహా॥ (అథ. 3-17-1)

ఓం యునక్త సీరా వి యుగా తనోత కృతే యోనౌ
వపతేహ బీజమ్ । విరాజః శ్నుష్టిః సభరా అసన్నో

నేదీయ ఇతస్సృణ్యః పక్వ మా యవన్ ॥స్వాహా॥ (అథ. 3-17-2)

ఓం లాఙ్గలం పవీరవ త్సుశీమం సోమసత్సరు । ఉదిద్వపతు
గామవిం ప్రస్థావద్రథవాహనం పీవరీం చ ప్రఫర్వ్యమ్ ॥స్వాహా॥
(అథ. 3-17-3)

ఓం ఇన్ద్రః సీతాం నిగృహ్ణాతు తాం పూషాభి రక్షతు । సా నః
పయస్వతీ దుహాముత్తరా ముత్తరాం సమామ్ ॥స్వాహా॥ (అథ. 3-17-4)

ఓం శునం సుఫలా వితుదన్తు భూమిం శునం కీనాశా
అను యన్తు వాహాన్ । శునాసీరా హవిషా తోశమానా
సుపిప్పలా ఓషధీః కర్తమ స్మై ॥స్వాహా॥ (అథ. 3-17-5)

ఓం శునం వాహాః శునం నరః శునం కృషతు లాఙ్గలమ్ ।
శునం వరత్రా బధ్యన్తాం శునముష్ట్రామ దిఙ్గియ ॥స్వాహా॥
(అథ. 3-17-6)

ఓం శునాసీరేహ స్మమే జుషేథామ్ । యద్దివి చక్రథుః
పయస్తే నేమాముప సిఞ్చతమ్ ॥స్వాహా॥ (అథ. 3-17-7)

ఓం సీతే వన్దామహే త్వార్వాచీ సుభగే భవ । యథా నః
సుమనా అసో యథా నః సుఫలా భువః ॥స్వాహా॥ (అథ. 3-17-8)

ఓం ఘృతేన సీతా మధునా సమక్తా విశ్వైర్దేవై
రనుమతా మరుద్భిః । సా నః సీతే పయసాభ్యావ
వృత్స్వోర్జస్వతీ ఘృతవ త్పిన్వమానా ॥స్వాహా॥ (అథ. 3-17-9)

ఓం ఇన్ద్రాగ్నిభ్యాం ॥స్వాహా॥
(ఇదమిం ద్రాగ్ని భ్యాం ఇదన్న మమ.)

ఓం విశ్వేభ్యో దేవేభ్య ॥స్వాహా॥
(ఇదం విశ్వేభ్యో దేవేభ్యః ఇదన్న మమ.)

ఓం ద్యావా పృథివీభ్యాం ॥స్వాహా॥
(ఇదంద్యావా పృథివీభ్యామ్ ఇదం న మమ.)

ఓం స్విష్టమగ్నే అభిత త్పృణీహి విశ్వాంశ్చ దేవః

**పృతనా అభిష్యక్ । సుగన్ను పన్థాం ప్రదిశన్న**
**ఏహి జ్యోతిష్మద్ధేహ్యజరం న ఆయుః ॥స్వాహా॥**

**ఓం యదస్య కర్మణోऽత్యరీరిచం యద్వా న్యూన**
**మిహాకరమ్ । అగ్నిష్టత్స్విష్టకృద్విద్యాత్ సర్వం**
**స్విష్టం సుహుతం కరోతుమే అగ్నయే స్విష్టకృతే**
**సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం**
**సమర్ధయిత్రే సర్వాన్నః కామాన్త్సమర్ధయ ॥స్వాహా॥**
**(ఇద మగ్నయే స్విష్టకృతే ఇదం న మమ.)** (శతపథ. 14-9-4-24)

## 12. "సీతాష్టమీ" "జానకీ జయంతి"

ప్రతి సంవత్సరము ఫాల్గుణ బ॥ 8 సద్గుణ సంపన్నురాలైన సీతాదేవి యొక్క జన్మదినము - నారీమణులచే నయ్యదొక ఐతిహాసిక పర్వముగా నొనర్చబడుచున్నది.

తత్వజ్ఞాన సంపన్నుడైన జనక మహారాజుగారి పుత్రికయు, అయోధ్యా రాజ్యాధిపతి శ్రీరాముని ధర్మపత్నియునై యున్నను ఘోర కష్టముల భరించుచు, శీలమును, ధర్మమును, మనసా, వాచా, కర్మణా పాలించి ప్రపంచమున నారీమణులలో శిరోమణిగ ప్రసిద్ధి గాంచినందున ఆమె జన్మదినమొక పర్వముగా జరుపబడుచున్నది. ఎందుకన్న ఆ దేవి స్త్రీ జాతి గౌరవమును ఆదర్శప్రాయముగ కాపాడినందున అన్య స్త్రీ సమాజ మా పవిత్ర జీవితమును పాటించి అట్లనుకరించుటకుగాను ఆమె జన్మదిన మొక పర్వరూపమున జరుపుట మిగుల అవసరమన నొప్పును. ఆరోజు స్త్రీలందరు నొకరి నొకరు పసుపుకుంకుమాదుల నిచ్చి ఆమె జీవిత చరిత్రను వినుటయు, అట్లే సామాన్య ప్రకరణస్థ సమస్త అగ్నిహోత్రాది క్రియ లొనర్చి క్రింద వ్రాయబడిన రెండు మంత్రములతో 2 విశేషాహుతుల నిచ్చి యజ్ఞమును ముగించవలెను.

### విశేషాహుతుల మంత్రములు

**ఓం అక్ష్యౌ నౌమధు సంకాశే అనీకంనౌ సమంజసమ్ ।**
**అన్తః కృణుష్వ మాంహృది మన ఇన్నౌ సహాసతి ॥1॥** -అథర్వ 7-36-1
**ఓం అభిదత్వా మనుజాతేన ధామి మమ వాససా ।**
**యథాసో మమ కేవలో నాన్యాసాం కీర్త యశ్చన ॥2॥**-అథర్వ 7-37-1



# యజ్ఞాంత ప్రార్థన

పూజనీయ ప్రభో హమారే భావ ఉజ్వల కీజియే ।
ఛోడదేవేం ఛల కపట్‌కో మానసిక బల దీజియే ॥ 1

వేదకీ బోలేం ఋచాయేం సత్యకో ధారణ్ కరేం ।
హర్షమేం హోం మగ్నసారే శోకసాగర సేతరేంః ॥ 2

అశ్వమేధాదిక్ రచాయేం యజ్ఞ పర ఉపకార కో ।
ధర్మమర్యాదా చలాకర్ లాభ్‌దేం సంసార కో ॥ 3

నిత్య శ్రద్ధాభక్తిసే యజ్ఞాది హమ్ కరతే రహేం ।
రోగపీడిత విశ్వ కే సంతాప్ సబ్ హరతే రహేం ॥ 4

భావనా మిట్ జాయే మన్‌సే పాప అత్యాచార కీ ।
కామనాయే పూర్ణహోవేం యజ్ఞసే నరనారి కీ ॥ 5

లాభకారీ హోహవన్ హర్ జీవధారీ కే లియే ।
వాయుజల సర్వత్ర హోశుభగంధ కో ధారణ్ కియే ॥ 6

స్వార్థ భావ్ మిటే హమారే ప్రేమపథ విస్తార హో ।
ఇదన్న మమ కా సార్థక ప్రత్యేక మేం వ్యవహార హో ॥ 7

హాథ్ జోడ్ ఝుకాయె మస్తక్ వందనా హమ్ కర్ రహేం ।
నాథ్ కరుణా రూపకరుణా ఆప్‌కీ సబ్ పర్ రహేం ॥ 8

## వైదిక ధ్వజ గీతము (సంస్కృతం)

దోధూయతాం వైదిక పతాకా విశ్వ జయనీ భారతే
సంజాయతాం ఘోషః శ్రుతీనాం పావనే భువి భారతే ...భారతే (దో)

కోపి మా దీనో భవేత్ హీనో మలీనో మానవః
సర్వేజనాః సుఖినోభవేయుః మానభూమౌ భారతే ...భారతే (దో)

ఆయన్తు మునయః పూర్వజాః దేశం సభాజియితుం పునః
సంపద్యతాం గురుతాం పునః విశ్వస్య భవ్యే భారతే ...భారతే (దో)

ప్రాక్తనా వర్ణవ్యవస్థా చాశ్రమాణాం వర్తనమ్
దీవ్యతాత్ దైనం దినం ద్యుతిధామ దివ్యే భారతే ...భారతే (దో)

వ్యాపృతాః సర్వే భవేయుః దేశ నిర్మాణే నవే
జీవతాత్ గణతంత్ర రాజ్యం సర్వసుఖదం భారతే ...భారతే (దో)

## ఓం ధ్వజ గీతము (హిందీ)

జయతి ఓం ధ్వజ వ్యోమ విహారీ, విశ్వప్రేమ ప్రతిమా అతి ప్యారీ
॥జయతి॥

సత్య సుధా బర్సానే వాలా, స్నేహలతా సర్సానే వాలా
సౌమ్య సుమన్ వికసానేవాలా, విశ్వవిమోహక్ భవ భయ హారీ
॥జయతి॥

ఇస్ కే నీచే బఢే అభయ్ మన్, సత్పథ్ పర్ సబ్ ధర్మధురీ జన్
వైదిక్ రవి కా హో శుభ్ ఉదయన్, ఆలోకిత్ హోవే దిశామే
॥జయతి॥

ఇస్ సే సారే క్లేశ్ శమన్ హో, దుర్మతి దానవ ద్వేష్ దమన్ హో, అతి
ఉజ్వల్ అతిపావన్ మన్హో, ప్రేమ తరంగ్ బహే సుఖ్ కారీ
॥జయతి॥

ఇసీ ధ్వజా కే నీచే ఆకర్, ఊంచ్ నీచ్ కా భేద్ భులాకర్
మిలే విశ్వముద మంగల్ గాకర్, పంథాయీ పాఖండ్ బి సారీ
॥జయతి॥

ఇసీ ధ్వజా కో లేకర్కర్ మే, భర్ దే వేద్ జ్ఞాన్ ఘర్–ఘర్ మే
సుభగ్ శాంతి ఫైలే జగ్ భర్ మే, మిటే అవిద్యాకే అంధియారీ
॥జయతి॥

విశ్వ ప్రేమ కా పాఠ్ పఢావే, సత్య అహింసాకో అప్ నావే
జగమే జీవన్ జ్యోతి జగానే, త్యాగ్ పూర్ణ హో వృత్తి హమారీ
॥జయతి॥

ఆర్య జాతి కా సుయశ్ అక్షయ్ హో, ఆర్య ధ్వజా కీ అవిచల్ జయహో
ఆర్య జనోంకా ధ్రువ్ నిశ్చయ్ హో, ఆర్య బనావే వసుధా సారీ
॥జయతి॥

# హారతి

ఓమ్ జయ జగదీశ హరే, ప్రభు ! జయ జగదీశ హరే
భక్తజనోం కే సంకట క్షణమే దూర్‌కరే
జో ధ్యావే, ఫలపావే, దుఃఖ వినశే మనకా
సుఖ సంపత్ ఘర్ ఆవే, కష్టమిటే తనకా. ॥ఓం॥

మాతపితా తుమ్ మేరే, శరణ గహూ కిస్‌కీ
తుమ్ బిన ఔర్ న కోఈ, ఆస్ కరూ జిస్‌కీ. ॥ఓం॥

తుమ్ పూరణ పరమాత్మ తుమ్ అంతర్యామీ
పరబ్రహ్మ పరమేశ్వర, తుమ్‌సబ్‌కే స్వామీ. ॥ఓం॥

తుమ్ కరుణా కే సాగర్, తుమ్ పాలనా కర్తా
మై సేవక తుమ్ స్వామీ, కృపా కరో భర్‌తా. ॥ఓం॥

తుమ్ హో ఏక అగోచర్, సబ్‌కే ప్రాణపతి
కిస్ విధి మిలూ దయామయ్, తుమ్‌కో మై కుమతీ. ॥ఓం॥

దీనబంధు దుఖ్ హర్తా తుమ్ రక్షక మేరే
కరుణా హస్త బఢాఓ, శరణ్ పడా తేరే. ॥ఓం॥

విషయ వికార మిటావో పాపహరో దేవా
శ్రద్ధా భక్తి బఢావో సంతనకీ సేవా. ॥ఓం॥

# అథ స్వస్తివాచన మంత్రాః

ఓం అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం,
హోతారం రత్నధాతమమ్ ॥ – ఋ. 1-1-1

ఓం స నః పితేవ సూనవేఽగ్నే సూపాయనో భవ
స చ స్వానః స్వస్తయే – ఋ. 1-1-9

ఓం స్వస్తినో మిమీతా మశ్వినా భగః స్వస్తి దేవ్యదితి రనర్వణః
స్వస్తి పూషా అసురో దధాతు నః స్వస్తి ద్యావా పృథివీ సుచేతునా ॥
– ఋ. 5-51-11

ఓం స్వస్తయే వాయు ముప బ్రవామహై సోమం స్వస్తి భువనస్య యస్పతిః,
బృహస్పతిం సర్వగణం స్వస్తయే స్వస్తయ ఆదిత్యాసో భవన్తు నః ॥
– ఋ. 5-51-12

ఓం విశ్వే దేవా నో అద్యా స్వస్తయే, వైశ్వానరో వసురగ్నిః స్వస్తయే,
దేవా అవన్త్వృభవః స్వస్తయే స్వస్తి నో రుద్రః పాత్వంహసః.
– ఋ. 5-51-13

ఓం స్వస్తి మిత్రా వరుణా స్వస్తి పథ్యే రేవతి,
స్వస్తి న ఇన్ద్రశ్చాగ్ని శ్చ స్వస్తినో అదితే కృధి. – ఋ. 5-51-14

ఓం స్వస్తి పన్థా మనుచరేమ సూర్యాచంద్రమసా వివ,
పునర్దదతాఘ్నతా జానతా సంగ మేమహి ॥ – ఋ. 5-51-15

ఓం యే దేవానాం యజ్ఞియా యజ్ఞియానాం మనోర్యజత్రా అమృతా
ఋతజ్ఞాః, తే నో రాసన్తా మురుగాయ మద్య యూయం పాత
స్వస్తిభిః సదా నః ॥ – ఋ. 7-35-15

ఓం యేభ్యో మాతా మధుమత్పిన్వతే పయః పీయూషం ద్యౌ రదితి
రద్రి బర్హాః, ఉక్థశుష్మాన్ వృషభ రాన్త్స్వప్నసస్తాం ఆదిత్యాం
అనుమదా స్వస్తయే ॥ – ఋ. 10-63-3

ఓం నృచక్షసో అనిమిషన్తో అర్హణా బృహద్దేవాసో అమృతత్వ మానశుః
జ్యోతీరథా అహిమాయా అనాగసో దివో వర్ష్మాణం వసతే స్వస్తయే.
– ఋ. 10-63-4

ఓం సమ్రాజో యే సువృధో యజ్ఞమాయయు రపరిహ్వృతాదధిరే
దివి క్షయమ్, తాం ఆవివాస నమసా సువృక్తిభి ర్మహో ఆదిత్యాం
అదితిం స్వస్తయే ॥ – ఋ. 10-63-5

ఓం కోవః స్తోమం రాధతి యం జుజోషథ విశ్వే దేవాసో మను షోయతిష్ఠవ,

కోవోఽ ధ్వరం తు విజాతా అరం కర ద్యోనః పర్షదత్యంహః స్వస్తయే.
- ఋ. 10-63-6

ఓం యేభ్యో హోత్రాం ప్రథమామాయేజే మనుః సమిద్ధాగ్ని ర్మనసా సప్తహోతృభిః, త ఆదిత్యా అభయం శర్మ యచ్ఛత సుగానః కర్త సుపథా స్వస్తయే ॥ - ఋ. 10-63-7

ఓం య ఈశిరే భువనస్య ప్రచేతసో విశ్వస్య స్థాతుర్జగతశ్చ మన్తవః, తే నః కృతాదకృతాదేన సస్పర్యద్యా దేవాసః పిపృతా స్వస్తయే ॥
- ఋ. 10-63-8

ఓం భరే ష్వింద్రం సుహవం హవామహే, అంహోముచం సుకృతం దైవ్యం జనమ్, అగ్నిం మిత్రం వరుణం సాతయే భగం, ద్యావా పృథివీ మరుతః స్వస్తయే ॥ - ఋ. 10-63-9

ఓం సుత్రామాణం పృథివీం ద్యామనేహసమ్, సుశర్మాణ మదితిం సుప్రణీతిమ్, దైవీం నావం స్వరిత్రామనాగసమస్రవంతీ మారుహేమా స్వస్తయే ॥ - ఋ. 10-63-10

ఓం విశ్వే యజత్రా అధివోచ తోతయే త్రాయధ్వం నో దురేవాయా అభిహ్రుతః, సత్యయా వో దేవహూత్యా హూవేమ, శృణ్వతో దేవా అవసే స్వస్తయే ॥ - ఋ. 10-63-11

ఓం అపామీవామప విశ్వామనాహుతి మపారాతిం దుర్విదత్రామఘాయతః ఆరే దేవా ద్వేషోఽ స్మద్యుయోతనోరుణః శర్మయచ్ఛతా స్వస్తయే ॥
- ఋ. 10-63-12

ఓం అరిష్టః సమర్తో విశ్వ ఏధతే ప్ర ప్రజాభిర్జాయతే ధర్మణ స్పరి । య మాదిత్యాసో నయథా సునీతిభి రతి విశ్వాని దురితా స్వస్తయే ॥
- ఋ. 10-63-13

ఓం యం దేవాసోఽ వథ వాజసాతౌ యం శూరసాతా మరుతో హితే ధనే, ప్రాతర్యావాణం రథమింద్ర సానసి మరిష్యన్త మారుహేమా స్వస్తయే॥
- ఋ. 10-63-14

ఓం స్వస్తినః పథ్యాసు ధన్వసు స్వస్త్యప్సు వృజనే స్వర్వతి స్వస్తి నః పుత్రకృథేషు యోనిష స్వస్తి రాయే మరుతో దధాతన ॥
- ఋ. 10-63-15

ఓం స్వస్తి రిద్ధి ప్రపథే శ్రేష్ఠా రేక్ణ స్వత్యభి యా వామ మేతి సానో అమాసో అరణే నిపాతు స్వావేశా భవతు దేవగోపా ॥
- ఋ. 10-63-16

**ఓం ఇషే త్వోర్జేత్వా వాయవ స్థ దేవో వః సవితా ప్రార్పయతు శ్రేష్ఠ తమాయ కర్మణ ఆప్యాయధ్వమఘ్న్యా ఇంద్రాయ భాగమ్, ప్రజావతీరనమీవా అయక్ష్మా మావస్తేన ఈశత, మాఘశగ్ంసో ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీ ర్యజమానస్య పశూన్ పాహి ॥**

- యజు. 1-1

**ఓం ఆనో భద్రాః క్రతవో యంతు విశ్వతో౽దబ్ధాసో అపరీతీస ఉద్భిద, దేవా నో యథా సదమిద్వృధే అసన్నప్రాయువో రక్షితారో దివే దివే ॥**

- యజు. 25-2

**ఓం దేవానాం భద్రా సుమతి ర్ఋజూయతాం దేవనాగ్ం రాతిరభి నో నివర్తతామ్ । దేవానాం సఖ్యముపసేదిమా వయమ్ దేవా న ఆయుః ప్రతిరంతు జీవసే ॥** - యజు. 25-15

**ఓం తమీశానం జగతస్తస్థుషస్పతిం ధియం జిన్వమవసే హూమహే వయమ్ । పూషా నో యథా వేదసా మసద్వృధే రక్షితా పాయు రదబ్ధ స్వస్తయే ॥** - యజు. 25-17

**ఓం స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః, స్వస్తినః పూషా విశ్వ వేదాః, స్వస్తి నస్తార్క్ష్యో అరిష్ట నేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు ॥**

- యజు. 25-19

**ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః స్థిరైరంగైస్తుష్టువాగ్ంస స్తనూభి ర్వ్యశేమహిదేవ హితం యదాయుః॥**

- యజు. 25-21

**ఓం అగ్న ఆ యాహి వీతయే గృణానో హవ్యదాతయే, నిహోతా సత్సి బర్హిషి ॥** - సామ. 1-1

**ఓం త్వమగ్నే యజ్ఞానాం హోతా విశ్వేషాం హితః, దేవేభి ర్మానుషే జనే ॥** - సామ. 1-2

**ఓం యే త్రిషప్తాః పరియంతి విశ్వారూపాణి బిభ్రతః వాచస్పతి ర్బలతేషాం తన్వో అద్య దధాతు మే ॥** - అథ. 1-1-1

(ఇతి స్వస్తివాచన మంత్రాః)

పరమేశ్వరుడు శాంతిమయుడు. అట్టి పరమేశ్వరుని కృపవలన ఈ సృష్టిలోని సమస్త పదార్థములు మాకు శాంతి దాయకములు కావలయునని నిత్యము శాంతికరణ మంత్రములతో భగవంతుని ప్రార్థింపవలయును.

**గాయత్రి ఆశ్రమ ట్రస్టు**

12-10-586/6, ఆర్య సమాజము,
వారాసిగూడ, సికింద్రాబాద్-500 061.
(ఇందిరానగర్ రోడ్డు - 2)
సెల్ : 9848011073,
9908994084

Bill No.:

Date : ........................................

To : ........................................

........................................

........................................

| S.No. | Particulars | copies | Rate | Amount |
|---|---|---|---|---|
| | **డా॥ కోడూరి సుబ్బారావు గారి రచనలు** | | | |
| 1. | గాయత్రీ విజ్ఞానం | | 100.00 | |
| 2. | వేదార్థ విజ్ఞానం | | 100.00 | |
| 3. | వేదాలలో సూర్యకిరణ చికిత్స | | 80.00 | |
| 4. | వేదాలలో సార్వజనిక నియమములు | | 80.00 | |
| 5. | మన ఇతిహాసం | | 70.00 | |
| 6. | మన వేదశాస్త్రాల పరిచయం | | 70.00 | |
| 7. | అగ్నిహోత్రం 100 శాతం వైజ్ఞానికం | | 60.00 | |
| 8. | వేదాలలో జలచికిత్సా విజ్ఞానం | | 60.00 | |
| 9. | జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ | | 60.00 | |
| 10. | వేదాలలో దేశభక్తి | | 60.00 | |
| 11. | పెండ్లినాటి ప్రమాణాలు | | 50.00 | |
| 12. | గర్భాధాన విజ్ఞానం | | 50.00 | |
| 13. | సంధ్యావందనం-వైజ్ఞానిక సమాలోచన | | 50.00 | |
| 14. | వేదామృతం | | 50.00 | |
| 15. | గణపతి రహస్యము, శివరాత్రి రహస్యము | | 50.00 | |
| 16. | వేదాలలో మనోవిజ్ఞానం | | 50.00 | |
| 17. | వైదిక ధర్మం అంటే? | | 50.00 | |
| 18. | అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ | | 40.00 | |
| 19. | గోమాత | | 40.00 | |
| 20. | దౌహృదిని | | 40.00 | |
| 21. | మరణానంతరం జీవుని ప్రయాణం | | 40.00 | |
| 22. | మానవ ధర్మము | | 40.00 | |

